

ఆచార్య జయంతి సంచిక

సంపుటి 7
సంచిక 1
జనవరి 1964
విడి ప్రతి 25 న.పై.
సాలు చందా రూ. 3




# రవాణా సమాచార్

# RAVAANA SAMACHAR

# रवाणा समाचार

మా ఖాతాదారులందరికి నూతన సంవత్సర శుభాకాంక్షలు

# ది రోడ్ వర్ధీ టైర్ వర్క్స్

ఫుల్ సర్కిల్ టైర్ రీట్రేడర్సు

**విజయవాడ-2.**

నాణ్యమైన గబ్బరుతో, నిపుణులైన పనివారిచే సకాలమున బాగుచేసి

గ్యారంటీ ఇవ్వగల సంస్థ.

ఒకసారి పనిచేయించిన మీకే తెలియగలదు.

మా ఖాతాదారులందరికి నూతన సంవత్సర శుభాకాంక్షలు

అరిగిపోయిన మీ టైర్లనుగూర్చి శ్రమపడి ఆలోచించకండి.

ఒకసారి ప్రయత్నించిన మా గ్యారంటీ పనితనము, మన్నిక

క్రొత్త టైరు వాడకంతో పోటీచేయగల విధానము తెలియగలదు.

వివరములకు:

ఫోన్ నెం. 276

# జయభారత్ మోటార్ స్టోర్స్

పట్నం బజార్ - **గుంటూరు-1**

సంపుటి 7

సంచిక 1

ఫోన్ నెం.

1087

రిజిష్టర్డ్ నెం.

A-103




ధరలనదుపులో

ఉంచేందుకు

సహాయపడండి.

* * *

దేశరక్షణకోసం

పొదుపుచేయండి.

ఎడిటర్ : జిల్లేపల్లి భాస్కరరావు.

శ్రీ శోభకృత్ నామ సంవత్సర మార్గశిర విదియ బుధవారం **1—1—64**

# నవచైతన్యం

చైతన్యం కలగటంలోనే నూతనత్వం గోచరిస్తుంది. నవచైతన్యమనటంలో నిత్యనూతనత్వం ప్రసాదితమవుతుంది. సామ్రాజ్యవాదపు పరజాల మధ్య తొంగిచూచే ప్రజాస్వామ్య ప్రభావం, రాబోయే ప్రజారాజ్యస్థిరత్వానికి నాందిగా పాతాలు తీర్చిదిద్దుతూంది. కటకటలాడే ప్రజానీకానికి పంటలు కిటకిటలాడి శ్రమకు ఫలితం కనిపిస్తుందీ కాలంలో. ఈవసంతంలో ఉత్సాహం పెల్లుబికి పరవళ్ళు తొక్కుతూంది. ఆ పరవశంతోనే ప్రతి కుటుంబీకుడు రాబోయే వత్సరానికి ప్రణాళికల రచిస్తూ కలలెన్నో కంటాడు. ఆ రచించిన ప్రణాళికల ప్రారంభానికి పూనుకుంటాడు.

కోడికూతల హెచ్చరికతో చలిగాలుల నిర్బంధాన్ని తట్టుకొనేందుకు చలిమంటల కాపు, ప్రాపుగా చేసుకొని హరిదాసు పలికించే హరినామస్మరణకు మురిసి గంతులువేసే మునిమనుమల ముద్దులకు మురిసిపోయే ముసలివారి మనస్సు నిబ్బరింపు కోడెవయస్సుల కూడజేరే మనుమరాండ్రు ముద్దలుముద్దలుగా పిసికి పారాణిజల్లి లోగిలిముందు తీర్చిన రంగవల్లికలపైన సింగారించేధోరణికి చిందువేసి, కావలసినంత పశుసంతతితో గోశాల గొప్పను వీక్షిస్తూ, ఆశ్రితుల పొగడ్తలకు అప్పుడప్పుడు సమాధానమిస్తూ, గంగిరెద్దు ఆటలతోను, గారడీగరడీలతోను, పగటివేషాల

ప్రతిభను గుర్తిస్తూ రాజ్యాంగవేత్తగా రూపొందే రైతు ప్రతిగ్రామంలోనూ యీ నాటికీ కనిపిస్తాడు. సంబరాల సందడిలో సంపాదనల సౌఖ్యంలో కూడ ముందు ప్రణాళికల రచన మరచిపోలేదు. పరతంత్ర పాలనలో పొందామో లేదో గాని స్వతంత్రం వచ్చింతర్వాత భారతీయులకు ప్రణాళికా రచనలే పరమ ధ్యేయమై అభివృద్ధి సాధన అత్యవసరమై నిత్య కృషి సత్యదృష్టి సదా వర్ధిల్లటానికి పునాదులుగా పరిణమించినవి. పాలన సాగించే ప్రజానాయకులు రూపొందించే రాజ్యాంగం వ్యక్తిగత పక్షపాతంతో గాక జన బాహుళ్య సౌకర్యార్థం సాగాలి. కనుక కర్తవ్యతా ప్రబోధం లోనూ, గమనికా విధానంలోను లోటుపాట్లు ఎప్పుడు ప్రజల కహితంగా గురుతింపబడినా మార్పుచేసుకోవచ్చు. లేకపోతే అజాగ్రత్తవల్ల గాని అలవాటులేకగాని మానవ దౌర్బల్యము వలనగానీ కాస్త కూస్త దోషాలున్నా వానిని గురుతింపజేసి దిద్దుకొనే సావకాశం కలుగ చేయటం వలన ప్రణాళికల పోకడ ప్రశాంతంగానే అనుకున్న స్థాయిని అందుకోగలదు. ప్రధాని శ్రీ నెహ్రూ చెప్పినట్లు దేశంలో ఈనాడు విమర్శకుల సంఖ్య పెరిగి వ్యతిరేక శక్తుల నార్మాణం సాగించి తమ వ్యక్తి స్వార్థాన్ని స్థాయీ రూపానికి తీసుకుని వచ్చే పోకడే ప్రధానంగా వుందిగాని ప్రణాళికాసాధ్యసాధనకు పనికివచ్చే ప్రామాణిక పౌరసత్వం నిరూపించే వాడొక్కడూ ముందడుగు వేయని కారణం వలన ప్రణాళికల వలన సాధించిన ప్రయోజనం మరుగున పడివుందని చెప్పడానికి సంశయం లేదు.

నేటి రవాణారంగంలో రైలురవాణాప్రాధాన్యం గుర్తింపబడింది. ప్రమాదాల నివారణకు, ప్రయాణీకుల ప్రయాణ సౌకర్యానికి, వ్యాపారాభివృద్ధికి, పరిశ్రమల అభివృద్ధికి ముడిసరుకుల రవాణాకు అనుగుణంగాను, ఇతర రవాణా కేంద్ర పెంపుదలకై ప్రణాళికారచన సాగి మనకై మనం రైలింజనులు ఆవిరిపై నడిచేవి తయారుచేసుకోవటమేగాక, విద్యుత్తుపైన, డీసెల్ ఆయిల్ తోను నడిచేవాటిని నిర్మించుకోగలిగినాము. సరకుల రవాణాకు, ప్రయాణీకుల సౌకర్యాల పెంపుదలతోను రైలుపెట్టెలు మనదేశంలో తయారుచేస్తున్నాము. సిగ్నలింగ్ విధానంలో క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టి, ప్రమాద నివారణకై కృషి సాగిస్తున్నాము.

రోడ్డురవాణా రంగంలో మంచిరోడ్ల పెంపుదలకై వెనుదీయకుండా సొమ్ము వెచ్చించి, గ్రామాలనుండి బస్తీలకు, పట్టణాలకు వెళ్ళేందుకు వీలుగా రోడ్లనిర్మాణం సాగింపగలిగాము. అధికమైన రవాణాభివృద్ధికి తట్టుకొనే రోడ్ల నిర్మాణానికి తగిన సర్వేలు జరిపి ఏర్పాట్లు సాగిస్తున్నాము. ప్రభుత్వస్థాయిలో రక్షణశాఖ ఆధ్వర్యముక్రింద శక్తిమాన్ ట్రక్కులు, జీపులు ట్రాక్టర్లు మనం ఉత్పత్తి చేసుకో గలిగాము. ప్రయివేటు యాజమాన్యంలో పొరుగు మిత్ర రాజ్యాల సహకారంతో అనేకంగా చిన్నకార్ల ఉత్పత్తి, స్కూటరుల ఉత్పత్తి పెంపుచేసు

కున్నాము. సైకిలు పరిశ్రమ, సైకిలురిక్షాల పెంపుదల తగినంతగా హెచ్చింది. విమాన రవాణా పరిశ్రమాభివృద్ధికి చిహ్నంగా శబ్దాన్ని మించి పయనించేజెట్ విమానాలను మనం తయారుచేసుకోగలిగాము. ఇండియన్ టెలిఫోను ఇండస్ట్రీసువారి ఆధ్వర్యంలో డైరక్టు ఆటో ఎక్స్ఛేంజిలను ఏర్పరచుకుంటూ టెలిఫోను, టెలిగ్రాఫు కేంద్రాలసంఖ్య దేశవ్యాప్తంగా పెంచగలిగాం. తపాలాసౌకర్యం ప్రతిచిన్న గ్రామానికి తగు సమీపంలో ఏర్పరచ గలిగాము.

సరకుల రవాణా కుపకరించేనౌకలను నిర్మించి ఈనాడు తీర ప్రాంతాలలో లోహాలు, ముడిసరకులు-వగైరాల రవాణా సముద్రంపై సాగిస్తున్నాము. దేశీయ జలరవాణా ప్రాబల్యానికి వీలుగా చిన్నరేవుల అభివృద్ధిపథకాలతో బాటు నదులపైన, కాలువలపైన బోటురవాణా సాగించేందుకు కావలసిన అభివృద్ధిపథకాలు ఏర్పరచినాము. విషయవిపులీకరణకు విజ్ఞాన వినోదసాధనకు వీలుగా రేడియో ప్రసార కేంద్రాలను పెంపుజేయగలుగుతున్నాము. అణుశక్తి సామాజికాభివృద్ధి కీలక శాంతికార్యాచరణకు వినియోగిస్తున్నాము. రాకెట్టుప్రయోగాలలో పరిణతిని సాధించాము. ఇలాంటి వెన్నో అభివృద్ధిగమ్యాలు మన మీ స్వతంత్ర ప్రజాపాలనలో మూడంచెల పంచవర్ష ప్రణాళికా సాధనలో చేరగలిగాము.

పొందిన అభివృద్ధికి పొంగిపోక రాబోయే కాలాల ప్రభావ ప్రామాణికాల నందుకొనేందుకు అచంచలదీక్షతో కృషిని సాగించ వలసిన బాధ్యత ఎంతేనివుంది. ఈనాడు దేశంలో గుర్తింపబడి మానవతకు మచ్చగా చెప్పబడే అవినీతిని అరికట్టి ఆత్మబలం పెంచుకుంటూ పాలనా వ్యవస్థలకార్యకలాపాలలో పరిశీలనాశక్తితో గుర్తింపు పొందుతూ విమర్శనాబుద్ధి వ్యతిరేకశక్తుల పురోగతిని పరిశీల పనివిధానాన్ని అనుసరించాలి. అదునయిన పరిధిలో పెట్టుబడి పెంపుదలకుపనివారు-యజమానులు-వారివారి తేడాలు సమన్వయపరచుకొని అభివృద్ధి సాధించాలి. శాస్త్రీయవిజ్ఞానసముపార్జనతో బాటుసులువయిన పద్ధతులను పొదుపు విధానంపై పరిశ్రమలపెంపు, పాడిపంటలపెంపు ఉపలక్షించి సక్రమసరఫరాను దేశమంతా ఫ్రీపర్మిట్టుపై రవాణాసాగే సావకాశాన్ని చూరగొనేందుకు సాధన సాగించాలి. రకరకాల రవాణాసాధనాల సమన్వయంసాగించి వ్యర్థప్రయత్నాలు చేయకుండా సహకార, సహన, సమన్వయ సూత్రాలు సాగేటట్టు చేయాలి.

గతంలో గడించిన అనుభవంతో అభివృద్ధి సాధనకు మనం ఒక్కటై ప్రజానాయకుల పరిశీలనలో ప్రణాళికాచరణతో ముందడుగు వేయాలి. పరిస్థితుల సమగ్రపర్యవేక్షణే చైతన్యం అనవచ్చు ఈ క్రాంతే తెలుగుదేశంలో సంక్రాంతి సందేశమై ప్రజలనుండి పాలకులవఱకు (రైతునుండి రాజ్యాంగవేత్తవరకు) తారకసూత్రమై అభివృద్ధిని అందిస్తుంది.

# సజ్జనుడు - మతిమంతుడు-హితకారి శ్రీ గోరా.

"శ్రీ గోపరాజు రామచంద్రరావుగారి నెరుగనివా రుండరు" ఇది తెలుగునాడులో నివసించే జనకోటి పలికే పలుకు. వృక్షశాస్త్ర జ్ఞాని కనుక పక్షపాత మెరుగకుండా ఉన్నదాన్ని ఉన్నట్లు అనగల మనస్సునిబ్బరము గల వ్యక్తి. వీరు ఆదర్శవాదులే గాక తన మతాన్ని జనహితంగా ఆచరించి చూపిన ధైర్యశాలి. శ్రీ గోరాగారు ఏదైనా సరే ఉద్యమ దృష్టితో ప్రచారం సాగించటానికి. సహజమైన ప్రతిభ కల్గిన వ్యక్తి. ఉద్యమ సాధకుడు. వారి పరిశోధనా పరిధిలో ఉపాసనా దీక్ష ఉద్యమ సాధనకు మొదటిమెట్టుగా భావింపబడుతుంది. అకుంఠిత దీక్షతో ఆత్మజ్ఞానాన్ని పెంచి నలువురకు పంచే వారి ప్రచారతరంగిణి జనవశీకరణ నందిపుచ్చుకున్నది. సాధుత వారిలోని విశిష్టత. కార్యసాధ్యతకు యీ సాధుతత్వం జిజ్ఞాసానుకూలతకు కొలబద్దగా వుపకరించటంతో ఆస్తిక్యసాధనకు ఆది కేంద్రంగా నాస్తికతను వరించారు. మతిమంతుడైన గోరా మనస్తత్వ శాస్త్రశోధనలో సృష్టి ఆదినుండి చైతన్యవాసిగా మానవుడు రూపొందే పరిణామదశల పురోగామిక సూత్రాలను తరచి జీవప్రయాణమంతా నాస్తిక కేంద్రమునుండేనన్న యదార్థాన్ని గుర్తించి తమ ప్రచారముకూడా నాస్తిక కేంద్రాన్నుంచి సాగించారు. కాబట్టి కృషికుడయిన జీవుడు తన ప్రయాణమార్గంలో పుట్టినప్పటినుండి తిరిగి పుట్టుకకు అనుభూతి పరిగణనకు చేరుకొనేవరకు సాధించినదంతా ఆస్తికతయని చెప్పవచ్చు. ఈ ఆస్తిక నాస్తిక కేంద్రాలకు మధ్య పయనించిన జీవుడు కర్మదక్షుడు, కార్యశూరుడు అవటంతో ఉత్తమపౌరుడుగా భాసింపగలుగుతాడు. అదే గోరా గారి అంతరార్థం కావచ్చు.

ఏదయినా శ్రీ గోరాగారు తాను తలపెట్టి నిలబెట్టిన ప్రతివ్యవస్థ, కార్యసరళి తనకోసం గాక పరులకోసం చేశారు. జనహితకారిగా ఆయన గుర్తింపబడిటానికి ఆయన షష్టిపూర్తి ఆంధ్రావనిలో పలుతావుల జరగడమే నిదర్శనం శ్రీ గోరా ప్రజానీకానికి పరమాప్తుడు. వారికి జరిగిన సన్మానం ఆంధ్రప్రజానీకానికే జరిగినట్లు. పతిత మానవోద్ధరణ ఆయన పరమదీక్ష. సర్వజన సమానత్వం ఆయనలోని మానవత్వం. కుల మత, విచక్షణారహిత దృష్టి ఆయన సృష్టి. ఆయనకు ఆయనే సాటి. అని పలుకుతుంది ప్రజాకోటి.


Cars & Trucks

TO

Buy or Sell

N. Vasudeva Rao

PHONE No. 1144.

VIJAYAWADA-2.

# భారతదేశంలో టెలీ కమ్యూనికేషన్ల అభివృద్ధి

భారత దేశంలో యిటీవల నాలుగు ప్రధాన నగరాల మధ్య బొంబాయి, ఢిల్లీ, మద్రాసు, కలకత్తా నగరాల మధ్య టెలెక్స సబంధాలను (టెలీ ప్రింటర్ యెక్స్ఛేంజిసబంధం) యేర్పాటు చేయటంతో టెలీకమ్యూనికేషన్ల సౌకర్యాలను పెంపొందించుటలో ఒకఅడుగు ముందుకు వేయటం జరిగింది.

ఈ టెలీప్రింటర్ ఎక్స్ఛేంజీలను యేర్పాటు చేసిన పట్టణాలలో టెలీప్రింటర్ చందాదారులు అదే పట్టణంలోని మరో టెలీప్రింటర్ చందా దారునకుగాని లేదా యితర పట్టణాలలోని చందాదారులకు గానీ ఆటోమాటిక్‌గా డయల్ చేసి సంభాషించవచ్చును. ఇంతేగాకుండా వీరివలన ఈ చందాదారులు యితర దేశాలలోని టెలీప్రింటర్ చందాదారులతో సంభాషించటానికి గూడ వీలౌతుంది.

ప్రస్తుతానికి బొంబాయి, ఢిల్లీ, మద్రాసు, కలకత్తా నగరాలమధ్యన ఆటోమాటిక్ డయిలింగ్ పద్ధతిన పూర్తిసంబంధాలు యేర్పాటు చేశారు. ప్రస్తుతం ఒక్క బొంబాయితో మాత్రం సంబధమున్న అహమ్మదాబాద్‌లోని టెలీ ప్రింటర్ ఎక్స్ఛేంజికి యితర టెలీప్రింటర్లన్నిటితో సంబంధాలు ఏర్పాటుచేస్తారు. తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో అంబాలా అమృతసర్, బెంగుళూరు, కోయంబత్తూరు, కటక్ గౌహతి జెంషెడ్పూర్, కాన్పూరు, లక్నో, నాగపూరు, పాట్నా, పూనా, రాజకోట్ సికిందాబాద్, తిరుచురాపల్లి నగరాలలో క్రొత్త టెలీప్రింటర్ ఎక్స్చేంజీలను తెరుస్తారు.

ఈ టెలీప్రింటరుఎక్స్ఛేంజీలలో ( టెలెక్స ) ఉపయోగించే టెలీప్రింటర్లన్నీ ఈ దేశంలోనే తయారుచేశారని టెలీప్రింటరు ఎక్స్ఛేంజీలలో ఉపయోగించే పరికరాలనూ ఎక్కువదూరం వార్తాప్రసారానికి వినియోగించే పరికరాలనూ, ఈదేశంలోనే రూపొందించి ఉత్పత్తి చేశారు తెలుసుకోవటం అవసరం.

తంతి తపాలా శాఖలోని టెలీకమ్యూనికేషన్లపరిశోధన కేంద్రం పరిశోధన నిర్వహించటంలోనూ అధునాతన సాంకేతికాభివృద్ధులను గ్రహించి పని చేయడంలోనునిర్వహించినకృషినిప్రశంసించవలసియున్నది. 1956 లో యేర్పాటు చేయబడినప్పటి నుండి ఈపరిశోధనా కేంద్రం దేశంలో టెలిగ్రాఫ్ టెలిఫోను సంబధాలను దినదినమూ పెరుగుతున్న అవసరాలను తీర్చడానికి వీలుగా అభివృద్ధి పరచడానికి అధికంగా సహాయపడింది.

దేశంలో కొద్దిప్రాంతంలో మాత్రమే ఈటెలీప్రింటరుసంబంధాలువున్నాయి. దేశంలో టెలిగ్రాఫ్ సర్వీసులుఅభివృద్ధిపరచడం ముఖ్యమైనందున అందుకు అనేకచర్యలుతీసుకున్నారు. వాయిస్ ఫ్రీక్వెన్సీ టెలిగ్రాఫ్ మార్గాలను చాలా వాటిని యేర్పాటుచేశారు. తృతీయ పంచవర్ష ప్రణాళికారంభంలో అటువంటి మార్గాలు

820 వుండగా 190 మాత్రం క్రిందటేడు (1962) మరో 672 మార్గాలను ఏర్పరచారు. ప్రణాళిక అంతానికి అటువంటి మార్గాలు సుమారు 3000 వుండగలవు.

ఈ ప్రణాళికాంతానికి టెలీగ్రాఫ్ కార్యాలయాలలో ఉపయోగించే టెలిప్రింటర్ల సంఖ్య మూడింతలు పెరగగలదు. కొన్ని ముఖ్య కేంద్రాలలో "టేప్ రిలే ఎక్స్ఛేంజి" లేదా టెలిగ్రాఫ్ సర్క్యూట్లను అదేమాదిరిగా పనిచేయించే పద్ధతులను (జెంటెక్స్) ప్రవేశపెట్టగలరు. వైర్ లెస్ టెలిఫోన్ సంబంధాలు మరికొన్నింటిని యేర్పాటు చేయగలరు. అదనంగా మరో ౨000 టెలిగ్రాఫ్ ఆఫీసులను తెరవడంద్వారా టెలిగ్రాఫ్ సర్వీసులను అభివృద్ధిపరచాలని కూడా అనుకుంటున్నారు. దేశంలో పట్టణాల మధ్య కోయాక్సిల్ కేబుల్స్, మైక్రోవేవ్ సంబంధాలను యేర్పాటుచేయడానికి కూడా కృషి జరుగుతున్నది.

స్థానిక ఎక్స్ఛేంజిల విషయంలో ప్రస్తుతము వున్న ఎక్ఛేంజీల శక్తి సామర్థ్యాలను పెంచాలని చిన్నవారినుండి పెద్దవారి వరకు క్రొత్త ఎక్ఛేంజీలను యేర్పాటుచేయాలని అనుకుంటున్నారు. తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో చిన్న ఎక్స్ఛేంజీలు షుమారు 1200 యేర్పాటుచేస్తారు. అన్నిటిలోకీ పెద్దఎక్స్ఛేంజి (30,000 మార్గాలు కలది) బొంబాయిలో పోర్టుప్రాంతంలో అమరుస్తారు. బొంబాయి, ఢిల్లీ, మద్రాసు, కాన్పూర్, నగరాలలో ఆరంభంలో అదేమాదిరి ట్రంకు టెలిఫోనులను అమరుస్తారు. ఈ ఎక్ఛేంజి ద్వారా మరో 25 కేంద్రాలలో ఆటోమాటిక్ పద్ధతిని సంబంధాలు ఏర్పాటు చేయవచ్చు. ఆ తర్వాత యిటువంటి ఎక్ఛేంజీలనే అహమ్మదాబాద్, బెంగుళూరు, కలకత్తా, కోయంబత్తూరు, జలంధర్ నాగపూర్ పట్టణాలలో ఏర్పరుస్తారు.

వీటినన్నిటినీ ఏర్పాటు చేసినపుడు దేశంలో ఎక్కువ ప్రాంతంలో ఒక చందాదారు మరో చందాదారుతో టెలిఫోనును డయల్ చేసి ట్రంకుకాల్ ఏర్పరచి సరాసరిన మాట్లాడుకునే పద్ధతిని (సబ్‌స్క్రైబర్ - టు - సబ్‌స్క్రైబర్ టెలిఫోన్ ట్రంకు డయలింగ్) ప్రవేశపెట్ట వీలవుతుంది. ప్రస్తుతం ఈ సౌకర్యం లక్నో-కాన్పూర్ - ఆగ్రా - ఢిల్లీ మధ్య మాత్రం వుంది.

చందాదారు సరాసరి డయల్ చేసే పథకం క్రింద (సబ్‌స్క్రైబర్ డయలింగ్ స్కీము) ఒకరు తన టెలిఫోను నుంచి మరో పట్టణంలోని చందాదారునకు నంబరున సరాసరి డయల్ చేసి సంభాషింప వచ్చును. ట్రంకు సంబంధం ఏర్పాటుకు ఆపరేటర్ సహాయం అవసరముండదు.


# రవాణా సమాచార్

ఆంధ్రప్రదేశ్ నందు తెలుగులో ప్రచురింపబడు ఒకే ఒక రవాణా సమస్యలకు సంబంధించిన మాసపత్రిక.

సంవత్సర చందా రు 3-00
విడిప్రతి- న.పై. 0-25

ఆంధ్రప్రదేశ్ యందన్ని
"హిగిన్ బాథమ్స్"

రైల్వేబుక్‌స్టాల్సులోను, లోకల్ బుక్‌స్టాల్సులోను దొరకును.

ఏజంట్లులేని ప్రదేశమందు ఏజంట్లు కావలెను.

'రవాణా సమాచార్' విజయవాడ.

శ్రీ డి. పుండరీకాక్షరావుగారు- అధ్యక్షులు, గుంటూరుజిల్లా బస్సుయజమానుల సంఘము తరపున రవాణాశాఖామంత్రి గా॥ శ్రీ బి. వి. గురుమూర్తిగారికి సమర్పించిన

# విజ్ఞప్తి

గడచిన చాల సంవత్సరముల నుండి మేము పాసింజరు బస్సుసర్వీసులను నడుపుట కలవాటు పడియున్నాము. 1958 సంవత్సరములో మొదలయిన బస్సుల జాతీయకరణవిధానము మా బ్రతుకుతెరువునకు గొడ్డలిపెట్టయినది. మాలో కొంతమంది — గత 40 సంవత్సరములనుండి కూడా బస్సుసర్వీసులనునడుపుతూ వారికుటుంబ సభ్యులందరు రోడ్డురవాణారంగంలో రకరకాల బాధ్యతలు స్వీకరించి పనిచేయుట కలవాటు పడినారు. అంతయేల - మా కుటుంబాలలో కొంతమంది స్త్రీలకు కూడా సమర్థవంతముగా తగినంతమంది పాడుపుతో సక్రమమైన విధానంతో ప్రయాణీకుల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకొని బస్సులు నడపటం తెలుసు. కానీ, దురదృష్టవశాత్తు ప్రభుత్వం యొక్క సౌకర్యార్థమే, ప్రయాణీకుల యొక్క జాతీయకరణ విధానాన్ని - రూపొందించారు. జాతీయకరణకు రూపొందిన కార్పొరేషన్, తెలంగాణా జిల్లాలతోపాటు - కృష్ణా, గుంటూరు. పశ్చిమగోదావరి, కర్నూల్ జిల్లాలలో జాతీయకరణ సర్వీసులను నడుపుచున్నది. గత 5॥ సంవత్సరాలుగా సాగే యీ కార్పొరేషన్ వారి సేవలో - కలిగిన లోపాలను, జాప్యాన్ని, ప్రజలందరు వివిధ దృక్కోణముల నుంచి - ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ - మోటారుబండ్ల చట్టము లోని 4 వ చాప్టరులో 68 సి సెక్షన్ ప్రకారం కార్పొరేషన్ సర్వీసులు ప్రజోపయోగకరముగా పనిచేయటం లేదని దృష్టికి తెచ్చారు. కాబట్టి లోగడనుండి ప్రజాసేవచేస్తూ, ప్రయాణీకుల మన్ననల నందుకొన్న - డిస్ట్రిక్ట్ ఆపరేటర్లు, ఈ జాతీయకరణ విధానము మార్పుచేయాలని ప్రజాక్షేమము - ప్రయాణీకుల వసతి గుర్తించాలని కోరడమైనది.

ఈనాడు ప్రభుత్వం బస్సులు తిరిగే విధానంలో చిన్నవి, పెద్దవి, మధ్యరకంవి అనే 3 రకాల రూట్ల నియామకము 153 డి. రూలు ప్రకారం గుర్తించారు. ఆ గుర్తింపు ననుసరించి - 75 మైళ్ళు మించిన దూరం గల పెద్ద రూట్లపై కార్పొరేషన్ వారు బస్సులను నడుపుకుంటూ - మిగతా రూట్లలో ఔదార్యము చూపించి - పూర్వంనుంచి రవాణా శాఖపై ఆధారపడి బ్రతికే కుటుంబాలకు, మధ్యరకము రూట్లపైన, చిన్న రూట్లపైన బస్సులను నడిపే అవకాశం కలిగించుటవలన - అటు ప్రజాసౌకర్యాన్ని పెంచటమే కాకుండా, ఇటు పరిశ్రమదార్ల అభివృద్ధికి, దోహదం కల్గజేసిన ట్లవు

తుంది. కార్పొరేషన్ బస్సు సర్వీసులను గమనిస్తే,— సరైన వేళలో తిరగని బస్సులకు — సీటుదొరక్క — నిలబడిపోయే ప్రయాణీకుల సంఖ్య ప్రతిబస్సుస్టాపులోనూ కనిపిస్తూ వుంది. దార్లో చెడిపోయిన బస్సులు - వర్కుషాపునకు చేరడానికే అనేక రోజులు పడుతుంది చిన్న చిన్న రిపేర్ల నిమిత్తం,— నిల్చిపోయిన బస్సుల సంఖ్య - ఏనాటి కానాడు మించిపోతున్నది. ఈ విధంగా కార్పొరేషన్‌పై — ప్రభుత్వం ఉంచిన నమ్మక - విశ్వాసం - భంగపడటం వల్ల ఈ ప్రజాస్వామిక ప్రభుత్వంలో కొన్ని కోట్ల ప్రజాధనం దుర్వినియోగ పరపబడుతున్నదని చెప్పక తప్పదు. బస్సులమీద పెట్టినపెట్టుబడి - వర్కుషాపుమీద పెట్టిన పెట్టుబడి - పని వారలకు చెల్లించే సొమ్ము. ఈనాడు కార్పరేషను సర్వీసులలో చడ్డపెట్టుబడిగా చెప్పకతప్పదు. కారణం కార్పొరేషను వలన ఊహించిన ధ్యేయాన్ని అందు పనిచేసే వ్యక్తులు పొందడానికి కృషి చేయకపోవడమే. పూర్వమెపుడూ ప్రయివేటు బస్సులు ఆగనూలేదు, ప్రయాణీకులు బాధపడనూ లేదు. ఈ విషయాన్ని రవాణామంత్రి గారు శ్రద్ధతో పరిశీలించి - ప్రభుత్వవైఖరిలో మార్పు తెస్తారని, జాతీయకరణ నిలుపుదల చేస్తారని కోరడమైనది.

యిట్లు,
గుంటూరుజిల్లా బస్సు ఓనర్ల అసోసియేషన్

## తిరుపతికొండపైకి టాక్సీలకనుమతి

రాష్ట్రంలో దూరదూరాలనుండి యాత్రికులను చేరవేసే మోటారుటాక్సీలు, కాంట్రాక్టు బస్సులు సరాసరి తిరుపతి కొండపైకి వెళ్ళే సావకాశం ప్రస్తుతానికి దేవస్థాన కమిటీవారు నిషేధించినందువలన యాత్రికుల కొరకు యిబ్బందిగా పరిణమించి యాత్రాసౌకర్యము భిన్నమై పోతూవుండటము గమనింపదగిన విషయము. ఈనాడు ఆంధ్రప్రదేశ్ టూరిస్టుడిపార్టుమెంటు వారు — యాత్రాభివృద్ధికి చేసే కృషి పథకాలలో ఈ విషయం ముఖ్యంగా గమనింపబడి రాష్ట్రంలోని యాత్రికులతో వచ్చే— మోటారుబండ్ల నన్నిటిని సరాసరి కొండపైకి వెళ్ళే ఏర్పాటుకు వీలు కల్పింపబడడము యెంతేని ముఖ్యము.

దేవస్థానంవారు ఈ అభ్యర్థనను గుర్తిస్తారని ఆశిస్తూ - అందుకు తగిన ఏర్పాటునకు దోహదము కల్పించవలసిందిగా ట్రాన్సుపోర్టు కమీషనరుగారిని ఈ మధ్య కలసి గుంటూరు ఆపరేటర్లు కోరడమైనది.



# తంతి - తపాలాశాఖకు ప్రత్యేకమంత్రి

## నియామకం అవసరమని సూచన.

భారత తంతి తపాలాశాఖ పనివారల జాతీయ సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ పి.యస్. ఆర్. ఆంజనేయులు మొన్న విశాఖపట్టణంనుంచి ఇక్కడకు వచ్చారు. ఆంధ్రసర్కిల్ తపాలా సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ సి. హెచ్. వి. సుబ్రహ్మణ్యం ప్రభృతులు ఆయనకు స్వాగతం చెప్పారు.

విక్రమ హాలులో సాయంత్రం తూర్పుగోదావరి మండలంలోని తంతి తపాలాశాఖల వేర్వేరు విభాగాల ప్రతినిధుల సమావేశం రాజమండ్రి పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ నిడమర్తి వెంకట నరసింహం అధ్యక్షతన జరిగింది.

శ్రీ టి. వి. వి. సత్యనారాయణమూర్తి (తపాలా విభాగం) శ్రీ జి.వి ఎల్. ఎన్. ఆచార్య (ఆర్. ఎం. ఎస్.) స్వాగత పత్రాలు చదివారు. వాటిలో రాజమండ్రి తంతి తపాలాశాఖ ప్రధాన కార్యాలయాలు మూడు చోట్ల వేరుగా వుండి వాటి భవనాల అద్దె క్రింద నెలకి 1 045 రూపాయలు చెల్లిస్తున్నారని చాలా అసౌకర్యంగా వున్నాయని వారన్నారు. పోస్టాఫీసు భవనం కూలిపోతుందేమోననే భయంతో సూపరింటెండెంటు ఆఫీసు మేడమీదనుంచి వేరేభవనంలోకి మార్చి పనిచేయిస్తున్నారనీ, పోస్టాఫీసు ప్రమాదకరమైన ఆభవనంలోనే పని చేస్తోందని కూడ వివరించబడింది. ఈ ఆఫీసు లన్నీ ఒకే చోట కేంద్రీకరింపబడినట్లయిన ఉద్యోగులకూ, ప్రజలకూ సౌకర్యంగా ఉండగలదన్నారు. స్వంత భవనం నిర్మించుకోవడం అవసరమని రాజమండ్రిలో ఇప్పుడు 600 టెలిఫోన్లు ఉన్నవనీ ఇంకా రెండువందలఫోన్లు కావాలని ప్రజలు పెట్టుకొన్న దరఖాస్తులు ఉన్నాయనీ 1,200 ఫోన్లు నిర్వహించగలశక్తి ఈ కేంద్రానికి ఉన్నా విస్తరణ జరగడంలేదనికూడ [illegible]వారు.

రంప చోడవరంలో పోస్టాఫీసు తుడిచేవానికి నెలకు మునుపు రు 7-50 నయాపైసలు యిస్తూ యిప్పుడు రు 0-81 నయాపైసలకు తగ్గింపబడిందనికూడా స్వాగతపత్రంలో తెల్పారు.

## తెలుగులో మనియార్డరు ఫారాలు

శ్రీయుతులు ఎ. వెంకటావు (ఆర్. ఎం. ఎస్) ఎస్. రంగారావు (తంతి), టి. వి. రెడ్డియాచారి (టెలిఫోను), పి ఎస్. ఎస్. రాజు (శ్రీకాకుళం) కె వి. ఎల్. నరసింహామూర్తి, (అమలాపురం) దైనందిన వ్యవహారాల్లో తమకు కలుగుతున్న ఇబ్బందులు, ఫారములకొరత, పని చేసే ఉత్సాహం పుట్టించని వాతావరణం, సౌకర్యాలు లేకపోవటం, ప్రమోషన్లు అత్యవసర పరిస్థితి పేరులో లేకుండా చెయ్యడం మొదలైనవిషయాలను గూర్చి ప్రసంగించారు. వారంతా నిత్యావసరధరలను ప్రభుత్వం అదుపులోనైనా పెట్టాలి. లేకపోతే జీతాలనైనా పెంచాలి అని వాదించారు. మనిఆర్డరు ఫారములు తెలుగులోనే వెయ్యాలన్నారు.

శ్రీ పి. ఎస్. ఆర్. ఆంజనేయులు తంతి తపాలాశాఖ కార్యాలయాలకు స్వంతభవనాలు, సిబ్బందికి నివాస గృహాలు, ఫారముల కొరత, ఆవరణలో కలిగే అనర్థాలు డిపార్టుమెంటు నిబంధ

వలలో సంస్కరణ ఆవశ్యకతను గురించి ప్రసంగించారు. రాజమండ్రి హెడ్ పోస్టాఫీసు భవనం దుస్థితి పోస్టల్ డిపార్టుమెంటుకే అగౌరవము అని శ్రీ ఆంజనేయులు వక్కాణించగా, సభలో హర్షధ్వానములు చెలరేగాయి.

1963 - 64 సంవత్సరం అంచనాల ప్రకారం తంతి తపాలా శాఖకు 16 కోట్ల రూపాయలు మిగులు ఉంటుందని తేల్చారనీ, గత సంవత్సరం అంచనా 10 కోట్లుకాగా 18 కోట్లు మిగిలిందనీ, అందుచేత, ఈ సంవత్సరం 25 కోట్లు నికరంగా మిగులవచ్చనీ, ఎంతమిగిలితే ఏం ప్రయోజనం? తంతి తపాలా సిబ్బందికి విద్య, వైద్య, వసతి, ప్రయాణ సౌకర్యాలు కలిగించకపోవడం అన్యాయమనీ, 56 కోట్లు నిలుపఉన్నా భవనాలైనా నిర్మించకపోవడం ప్రభుత్వనిర్లక్ష్యమనకతప్పదనీ కూడా ఆయన చెప్పారు.

తంతి తపాలా శాఖకు ప్రత్యేకంగా ఒక మంత్రి ఉంటేగాని, తంతి తపాలా టెలిఫోన్ల వారి ఇబ్బందులు తొలగవనీ, రైల్వేశాఖకు ఎటువంటి సౌకర్యాలు, ఖర్చులు చేస్తున్నారో అలాగే ఈశాఖకు చెయ్యాలనీ, శ్రీ ఆంజనేయులు అన్నారు.

పనిలో చేరిన ప్రతి ఉద్యోగి విరమించేలోగా కనీసం రెండు ప్రమోషన్లయినా పొందే అవకాశం కలిగించాలనీ, ఖాళీలు త్వరత్వరగా భర్తీ చెయ్యాలనీ, జాతీయ సమాఖ్య రాజమండ్రిలో తెలిపిన ప్రతి విషయంపైనా శ్రద్ధగా పనిచేస్తుందనీ చెబుతూ శ్రీ ఆంజనేయులు ఉపన్యాసాన్ని ముగించారు.

ఉత్తమసాహిత్యం - చదవండి.

| | | |
|---|---|---|
| 1. యుగధర్మం | శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ | 6-50 |
| 2. పడగలెత్తినకాలం | ,, | 3-50 |
| 3. నిరుద్యోగి | ,, | 3-50 |
| 4. శిరీషకుసుమాలు | శ్యామసుందరి | 3-00 |
| 5. సమీక్షణ | డా॥ రామకోటిశాస్త్రి | 3-00 |
| 6. నైమిశం | ,, | 3-00 |
| 7. తిరిగిరాని ప్రియురాలు | శ్రీ వేదుల | 2-00 |
| 8. నిరీక్ష (నాటికలు) | శ్రీ మురళీకృష్ణ | 1-50 |
| 9. కాళిదాసదర్శనం | శ్రీ బాలసుందరశాస్త్రి | 6-00 |

పై పుస్తకాలు కావలసినవారు మాకు వ్రాయగోర్తాను. తెలుగులో ఏ పుస్తకమైనా సప్లయి చేయగలము.

వివరములకు :

క్వాలిటీ పబ్లిషర్స్

విజయవాడ - 2

## తెనాలి టౌన్‌లో రైల్వే బుకింగ్ ఆఫీసు ఆవశ్యకత.

తెనాలి సంఘం అభ్యర్థి.

తెనాలి రైల్వే ప్రయాణీకుల సంఘ వార్షిక సర్వసభ్య సమావేశం శ్రీ మట్టిగుంట వీరభద్రరావు అధ్యక్షతన జరిగింది.

ప్రయాణీకుల రద్దీదృష్ట్యా వెంటనే ఒంగోలు విజయవాడలమధ్య డీసెల్ కార్లు నడపాలనీ, చుండూరు-విజయవాడలమధ్య సత్వరమే జంట రైలు మార్గమును నిర్మించాలనీ, తెనాలిపట్టణ ప్రాముఖ్యత దృష్ట్యా, నగరమధ్యభాగంలో టౌన్ బుకింగు ఆఫీసును ఏర్పాటు చేయాలనీ, రైల్వే అధికారులను కోరుతూ సభలో తీర్మానాలు చేశారు.

తరువాత నూతన సంవత్సరానికి కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.: శ్రీయుతులు పిల్లలమర్రి విజయవేణు గోపాలస్వామి (అధ్యక్షులు), మట్టిగుంట వీరభద్రరావు, (ఉపాధ్యక్షులు) అన్నవరపు నాగసంజీవరావు(ప్రధానకార్యదర్శి) ఆర్. శ్రీనివాసాచార్య, (సహాయ కార్యదర్శి), పల్లపోతు రామారావు, (కోశాధికారి), అక్కల సాంబయ్య, జాలాది రామమోహనరావు, కిందా నారాయణ, కోడూరు నాగేశ్వరరావు, టి. రామాచార్యులు, సామాసుబ్బారావు, (సభ్యులు)

---

## *EXTRACT*

Sub:- Prices of petroleum products H S.D,Oil - selling prices Ex pump

" I am directed to refer to your letter No by 8/1589/63 D 16-11-63 on the above matter and to state that by their letter no M.S 2526 D 16-11.63 the Home Department of Madras Government has already directed the Madras Divisonal petroleum Merchants Association not to charge beyond the ceiling price Ex retail pump outlets.

The West Bengal and Andhra Predesh Governments have also been suitably advised in the matter. As already stated earlier you should please take up this matter directly with the state Governments which have been duly briefed and are competent to take suitable action in case of default.

† True copy †

## తాడేపల్లిగూడెం బస్సు ప్రయాణీకుల క్రొత్త సమస్య

కొన్నిరోజులుగా తాడేపల్లిగూడెంలో బయలుదేరి మెరక ప్రాంతాలకు అంటే-పోలవరం, అశ్వారావు పేట, జంగారెడ్డి గూడెం, కొవ్వూరు వెళ్ళే బస్సులు రైల్వేస్టేషను వద్ద వుంచబడిన స్టాపునకు రాకుండా పోతున్నవి. ఇందువల్ల ఇచటి ప్రయాణీకులకు క్రొత్త స్థితి ఏ[illegible]న్నది.

శ్రీ వి. సి రామారావు (చీఫ్ ఎగ్జిక్యూటివు ఆఫీసరు) మునిసిపాలిటీ వారికి వ్రాసిన సమాధానంలో "రోడ్డురవాణా కార్పొరేషన్ వారి డిపోవద్ద క్రొత్త బస్సుస్టాండు ప్రారంభించబడినా, ప్రయాణీకుల సదుపాయం నిమిత్తం రైల్వే స్టేషను వద్ద వుండే స్టాండుకూడా వుంటుంది. అదీగాక ఆ స్టాండును శాశ్వతమయిన సదుపాయంగా చేసే విషయం కృషి చేస్తున్నాము అని తెలియజేశారు.

ఇందుమీద ప్రజాసంబంధపు అధికారి, చైర్మన్, చీఫ్ ఎగ్జిక్యూటివు అధికారులకు ప్రయాణీకుల సంఘం టెలిగ్రాములద్వారా అసమ్మతి తెలియజేసి తిరిగి పాతపద్ధతినే అనుసరించవలసిందని విజ్ఞప్తి చేసింది.

## ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవర్లు.

తంతి తపాలశాఖ ఉపమంత్రి శ్రీ బి. భగవతి నేడు లోక్‌సభలో శ్రీ ఉలాకా ప్రశ్నకు సమాధానమిస్తూ ఎక్స్‌ప్రెస్ బట్వాడా కవర్లు ప్రత్యేకమయిన గుర్తులతో, సైజులో, త్వరలో లభించగలవని తెలియజేశార. ఎక్స్‌ట్రా విభాగం వస్తువులను వుంచి తీసుకువెళ్ళే ప్రత్యేకమయిన సంచులు, కవర్లు, త్వరలో వాడకంలోకి రాగలవని ఇ. డి. ఉత్తరాలు త్వరగా బట్వాడా అయ్యేట్లు చూడడం దీని లక్ష్యమని చెప్పారు.

## ఏజెన్సీలో తపాలా సౌకర్యాలు.

భద్రాచలం ఏజన్సీ గ్రామాలలో తపాలా సౌకర్యాలు ఎక్కువచేసే కార్యక్రమాన్ని అనుసరించి ఈ నెలలో భద్రాచలం పోస్టల్ ఇన్‌స్పెక్టరు శ్రీ ఎస్. శేషగిరిరావు కూనవరం బ్లాకులోని తోటపల్లి, రేవుల బూర్గంపహాడ్ బ్లాకులోని రేపాకగొమ్ము బ్రాంచి ఆఫీసులకు ప్రారంభోత్సవం చేశారు. మరికొన్ని గ్రామీణ తపాలా ఆఫీసులు మార్చిలోగా ఏర్పాటు చెయ్యబడగలవని తెలుస్తున్నది.

త్వరలో గౌరీదేవిపేట బ్రాంచి ఆఫీసు, సబు ఆఫీసుగా మార్చబడగలదట

## ఆవడిలో టాంకుల ఉత్పత్తి.

ఆవడి ఫ్యాక్టరీలో టాంకుల నిర్మాణం ఏమీ ఆలస్యం కాలేదనీ, అనుకొన్న ప్రకారం 1965 లో ప్రారంభం అవుతుందనుకొంటున్నామని రక్షణ సామాగ్రి ఉత్పత్తి మంత్రి క్రొత్త రఘురామయ్య ఇవ్వాళ లోకసభలో తెలియజేశారు.

గ్లైడర్ల నిర్మాణం సందర్భంలో కాన్పూరులోని విమాన నిర్మాణ కేంద్రంలో 29 గ్లైడర్లు తయారయినవనీ, మరి 30 వివిధ దశలలోవున్నవనీ, శ్రీ రఘురామయ్య చెప్పారు. నేషనల్ కాడెట్ కోర్సువారు 300 గ్లైడర్లకు ఆర్డరు ఇచ్చారన్నారు.

శబ్దవేధి అయిన హెచ్. యఫ్. – 24 విమానం ఉత్పత్తి 'అభివృద్ధిదశలో' వున్నదని కూడా ఆయన తెలిపారు. దీనికి కావలసిన ఆర్ఫియస్ 703 ఇంజన్లు బెంగుళూరులోనే నిర్మాణమవుతున్నవనీ, ఈ ఇంజను భాగాలలో మూడింట ఒకవంతు మాత్రమే దిగుమతి అవుతున్నాయనీ ఆయన చెప్పారు.

* * *

# ట్రాన్స్‌పోర్టుకమీషనరుగారి కృష్ణాజిల్లా పర్యటన



రాష్ట్రపాలనాధికారులు తమ పాలనా బాధ్యతల నిర్వహిస్తూ ప్రజాసన్నిహితంగా మెలగటంకూడా విధినిర్వహణలోని భాగమని గుర్తించటం ముఖ్యంగా యీ స్వతంత్ర ప్రజా స్వామ్యపాలనపు రోజులలో మొదటి అంశం కాగలదు. ఆయా శాఖలకు సంబంధించిన ప్రజలకు, పరిశ్రమదారులకు, పనివారికి నిత్యజీవితంలో విపులీకరించుకోవలసిన, విడమరచి విన్నవించుకోవలసిన విషయాలెన్నో గోచరిస్తుంటవి. అన్నిటినీ విజ్ఞప్తులద్వారా పంపే దీక్ష, మనోపటిమ కొన్ని తావులలో లోపించవచ్చు. ఆలించే- పాలించే అధికారిగాని, మంత్రిగాని ప్రజాహితంగా ముచ్చటించేటప్పుడు గుర్తుకురాగలవెన్నో శాస్త్రీయ సాంకేతిక చిక్కుల విపులీకరణ సాగటం సహజం. ఏ చట్టమైనా ప్రజారక్షణకే ఏర్పరుపబడాలి. పూర్వకాలపు బానిస మనోవృత్తి వదలని కారణానకాని, అధికార వికేంద్రీకరణ ఆచరింపబడని కారణానగాని అధికారులు పాలనకర్తవ్యతా నిర్వహణకాలమందు చట్టాన్ని ప్రజా శిక్షణకే ఉపయోగింప చూడటంవలన రాజ్యాంగంలోని ఉదాత్తత మారురూపం దాల్చటంతో స్వతంత్రులమైన మనం తప్పులను చేయలేకుండా వుండలేక

పోతున్నాము. కొన్నికొన్ని వ్యవస్థలలో అధికారులు కొంతమంది నగ్నంగా యదార్థాన్ని చూపించేవారిపై అభాండాలు లేవదీసి, దేశద్రోహులక్రింద వారిని జమచూపిస్తూ ప్రజలను మోసగించి, ప్రజాహృదయాలలో చట్టాన్ని వర్తింపుచేయటంలో భయాందోళనలకు తావు కలిపిస్తూ తమ మాటల చెల్లింపు, గొప్పతనాన్ని గుర్తింపుచేసుకుంటున్నారు. ఈ పోకడ తుద ముట్టాలంటేను, అధికార వికేంద్రీకరణ సాగి స్థానిక అధికారి సమత న్యాయం చేయటానికి వీలు కల్పింపబడాలి. పై అధికారులు జరిపే ఈ న్యాయానికి భిన్నం వాటిల్లకుండా నడిచే నడకకు దోహదం రూపొందిస్తూ పరిశ్రమదారులకు, పనివారికి, ప్రజలకు నిత్యజీవితంలో కలిగే పరిణామాలవలన ఉత్పన్నమయ్యే సమస్యాపరిష్కారాల సూత్ర నిర్మాణానికి సమైక్యతాసాధనకు పూనుకోవాలి.

గత నెలలో విజయవాడ సందర్శించిన ట్రాన్సుపోర్టు కమీషనరుగారయిన హుమాయూన్ యార్‌జంగ్‌ఖాన్ గారికి విజయవాడ మోటార్ వ్యాన్ ఓనర్లు, పబ్లిక్‌టాక్సీఓనర్లు ఒక మెమొరాండం సమర్పించారు.



ఇంతవరకు ఆంధ్రప్రదేశ్ కంతటికీ ఒకే ఒక మోటారు వెహికల్సుఆక్టును సమకూర్చకుండా స్టేటు ట్రాన్సుపోర్టువారు 1939 చట్టానికి మద్రాసు మోటారు రోడ్ నిబంధనలతోను, 1957 ఎమెండుమెంటు ఆక్టుతోను హైదరాబాద్ మోటారు వెహికిల్సు ఆక్టుతోనూ, కలగాపులగంగా పాలనా యంత్రాంగాన్ని నరుగత్రిస్తున్న కారణాన మోటారు వాన్ సర్వీసులు ఆంధ్రాలో గుర్తింపబడలేదు. కృష్ణాజిల్లాలో మొదటగా ఆంధ్రప్రదేశ్ స్టేటు రోడ్డుట్రాన్సుపోర్టుకార్పొరేషనువారు బస్సు సర్వీసులు జాతీయంచేసి సాగించిన పాలనవలన ప్రయాణీకులు సకాలంలో ప్రయాణాలకువీలుగా సర్వీసులు అందకపోవటంవలన

మరొకరకమయిన రవాణా సౌకర్యం దొరకని కారణాన యిబ్బందులకు గురిఅవటం గమనించి కొంతమంది నిరుద్యోగులుగావున్న ట్రాన్సుపోర్టుఅనుభవజ్ఞులు మోటారువాన్ సర్వీసులను ఏర్పరచి పనిచేయటం సాగించారు. ఆనాడు పోలీసు డిపార్టుమెంటువారిచే ఆమోదం చేయబడిన 12, 15 సీట్లు గల వ్యానులు క్వార్టరుకు రు 39/- పన్ను చెల్లించి తిరిగేవి. రానురాను కార్పొరేషనువారు తమ అసమర్థతను మరుగుపరచి ప్రయాణీకులకు సౌకర్యం కలుగజేసే వ్యానులనడకను నిరోధించాలంటూ చేసేగోల నాధారంగా చేసుకొని ప్రభుత్వంవారి అనుజ్ఞమేరకు పాలనాధికారులు కేసులుబనాయించి భయపెట్టటంతోపాటు 1957 ఎమెండెడ్ మోటారుచట్టంలోని 33 సెక్షన్‌లోని అధికారాన్ని పురస్కరించుకొని వ్యానుల రిజిస్ట్రేషను సస్పెండుచేయటం సాగించారు. ఆ కారణాన కొంతమంది వ్యానుఆపరేటర్లు పర్మిట్లు ఇవ్వమని అడుగగా "క్యాబ్"గా మార్పిడిజరిపి ఏడుగురు ప్రయాణీకులను కంట్రాక్టుపద్ధతిని తీసుకొనిపోయేఏర్పాటుగా ఎక్కువ పన్నువసూలు రు 180/- దాకాచేసి పర్మిట్లుయిచ్చారు. కార్పొరేషనువారు గోల మామూలుగా సాగించటంవలన వీనికి పర్మిట్లజారీ విధానంపై అనేక ఒద్దికలుతెచ్చి అనువర్తనాబద్ధంగా వ్యాను సర్వీసులను తొలగించినంతపనిచేశారు అంటే ఈ నాడు దొంగతనంగా వ్యానుసర్వీసుల నడుప రావటంవలన, ఆరేళ్ళునిండినా కార్పొరేషనువారు ప్రయాణీకుల సౌకర్యాలు పెంచనందున ఈ నాటికీ ప్రయాణీకుల రద్దీవుంటూ వ్యాన్ సర్వీసులుసాగే పూర్తి సావకాశం వున్నందువలన తిరిగి చట్టబద్ధంగా వ్యాను సర్వీసులు 15, 16 మంది ప్రయాణీకులకు వీలుగా హైదరాబాదులో ఈనాటికీ చట్టప్రమేయంగా వీలున్నవిధంగా నడిచే సావకాశం కలిగించమని ఆపరేటరులందరూ ఏకగ్రీవంగా కమీషనరుగారికి విన్నవించుకున్నారు. దీనివలన వారి పెట్టుబడితోపాటు వారి సామర్థ్యము కుంటుపడకుండా ప్రజోపయోగం చేకూరగలదని ప్రభుత్వానికి పన్నులవసూలువలన అధికమైన సొమ్ము చేకూరగలదని చెప్పబడింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు సాగించి, సాధించదలచిన యాత్రికుల ప్రయాణపు సౌకర్యపథకానికి దోహదంగా మధ్యరకం ప్రయాణీకుల సంఖ్యగల పార్టీలకు వసతి కలుగగలదని చెప్పబడింది ముఖ్యంగా అసభ్యకరమైన దొంగపద్ధతిలో వ్యానులు నడిపే అలవాటు తప్పించేందుకు తమపెట్టుబడి సార్థకంచేసుకుంటూ తమ జీవనభృతి సంపాదించుకొనేందుకు చట్టబద్ధమైన అవకాశం కల్పిస్తూ, ప్రజాసేవచేయుటానికి దోహదం కల్పింపబడాలని విన్నవింపబడింది.

వీరి తర్వాత కమిషనర్ గారిని పర్మిట్లపై టాక్సీకార్లు త్రిప్పే ఆపరేటర్లు కలిసి వారు సక్రమంగా సర్వీసులు సాగించేందుకు ఆటంకంగా కనిపించే కేసుల విషయంలో పర్మిట్లులో చెప్పిన 4 ప్రయాణీకులతో పాటు కాంట్రాక్టు పార్టీగా వచ్చే ఒక రిద్దరుపిల్లల విషయంలో ఓవర్‌లోడ్ అని పెట్టబడే కేసులు అధికమైన దయతో వదలివేయబడాలని టూరిస్టు ట్రాఫిక్ వారికి వసతి కలిగించేందుకు రెగ్యులర్ టాక్సీ పర్మిట్లకు ఒకే పన్ను విధానంపై మద్రాసు, మైసూరు రాష్ట్రాలలో ప్రభుత్వ స్థాయిలో చర్చలు జరిపి సమన్వయ సహకారపు ఒప్పందం ఏర్పాటు చేయా

కోరబడింది. ట్రాన్సుపోర్టు కమిషనరుగారు విషయాలు సమగ్రంగా తెలుసుకొని ఉచితమైన విధానంలో విషయ పరిశీలన జేసి తగిన ఏర్పాటు చేయగలనని చెప్పారు.



తర్వాత కృష్ణాజిల్లా లారీ ఓనర్సు అసోసియేషన్ తరఫున ప్రెసిడెంటు జి. సూర్యనారాయణ, సెక్రెటరీ పి. కేశవరావు, వైస్ ప్రెసిడెంటు యం. రామారావుగార్లు ట్రాన్సుపోర్టు కమిషనరు గారిని కలిసి వినతిపత్రం అందించారు. 1-11-63 నాటికి ముందే ఆగివుండి అట్టి అపుడల అధికార వర్గీయులచేత గుర్తింపబడివున్న మోటారు బండ్ల విషయంలో గూడా యివ్వబడిన డిమాండ్లను గూర్చి ఆలోచించి న్యాయం కలిగిస్తూ అట్టివాటిని తొలగించమని అభ్యర్థించారు. క్రెడిట్ సర్టిఫికెట్ల విషయంలో ఒరిజినల్ చలానా పోయినప్పుడు ఆపరేటరు ఆర్థికస్థితిపై చలగాట మాడుతూ క్రెడిట్ సర్టిఫికెట్లు చెల్లవని చెప్పటం సబబు కాదని ఆపరేటర్లు ప్రభుత్వాన్ని మోసగిస్తారనుకోవటం మంచిది కాదని అందరికీ అందుబాటులో లేనివని, కనుక చట్టవిరుద్ధంగా వర్తించే క్రెడిట్ సర్టిఫికెట్ల నిరాకరణ తొలగించవలసినదని కోరారు. ట్రాన్సుపోర్టు కమీషనరుగారు ముక్తసరిగా సమాధానమిస్తూ పన్నుల విషయంలో ప్రభుత్వానిదే తుది తీర్పని, తనకేమీ అధికారాలు లేవని పెనాల్టీల విషయంలో తాను చాల ఔదార్యంగా వర్తించేదుకు అనుమతి నిచ్చానని చెప్పారు. క్రెడిట్ సర్టిఫికెట్ల విషయంలో నిజాయితీగా ఆపరేటర్లు నడిస్తే తాను వీలున్నంతవరకు త్వరలో సడలింపు సాగింపగలనన్నారు ముందునకు వచ్చి తమ కష్టసుఖాలు తెల్పిన ఆపరేటర్ల నభినందిచారు. సావధానంగా విని తగిన సలహా యిచ్చినందుకు కమిషనరుగారిని ఆపరేటర్లు మెచ్చుకున్నారు.

# ముఖ్యమంత్రికి, రవాణామంత్రికి మోటారు ఆపరేటర్ల వినతి

ది. 7-12-63 హైదరాబాదులో ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ నీలం సంజీవరెడ్డి గారిని, రవాణామంత్రి బి. గురుమూర్తి గారిని ఆంధ్రప్రదేశ్ మోటారు యూనియన్ శక్రటరీ శ్రీ యుద్దనపూడి రామబ్రహ్మం శ్రీ డి. నారాయణ రెడ్డి యం. యల్. ఏ. శ్రీ పి. వెంకట రెడ్డి యం. యల్. ఏ. శ్రీ ఎన్. సుబ్బారెడ్డి యం. ఎల్. సి. శ్రీ పట్టాభి వెంకట సుబ్బయ్య చెట్టి కడపజిల్లా మోటారు ట్రాన్సుపోర్టు ఆపరేటర్ల-అసోసియేషన్ శక్రటరీ, శ్రీ యం. వి. రామదాసు పంతులు విశాఖపట్నం జిల్లా బస్సు ఆపరేటర్ల అసోసియేషన్ శక్రటరీ శ్రీ వి. ఆర్. సత్యనారాయణ కడపజిల్లా స్టేటు ఆపరేటరు కలిసి ఒక వినతిపత్రాన్ని సమర్పించారు.

వినతి పత్రం సారాంశం :

క్రొత్తగా ఆంధ్రప్రదేశ్ మోటారు వెహికిల్సు టాక్సేషనుచట్టము 1963 అనుదానిని 1-4-63 నుండి అమలు పరచినారు. దీనికి పూర్వము 1939 మోటారుబండ్లచట్టం ప్రకారం పబ్లికు రోడ్లపై వాడబడే మోటారు బండ్లకు మాత్రం పన్ను వసూలు జరిగెడిది. రోడ్లపై నడుపబడక ఆగివున్న బండ్లేవీ పన్ను రాష్ట్ర ప్రభుత్వానికి చెల్లించే అవసరంలేదు. కాని ఈ క్రొత్తగా వచ్చిన 1963 మోటారుబండ్ల పన్ను చట్టమున గలపదభాగము వాడికకువుంచబడిన లేక వాడబడిన మోటారు బండ్లు పన్ను చెల్లింపవలసి యుండును. ఈ చట్టము రాక ముందు కొన్ని రవాణా మోటారు శకటములు ఆపబడివుండుట వలన 31-3-63 దాకా పన్నులు వసూలు చేయబడలేదు. కాబట్టి అట్టి బండ్ల యజమానులు తిరిగి స్టాపేజి రిపోర్టులను పంపవలసి యుండునసే విషయం విశదమరచనందున దాని ఆవశ్యకతను గుర్తింపనైరి.

వీరు లోగడ వున్న అలవాటు పద్ధతి ప్రకారం ఆయా ఆగివున్న మోటారు బండ్ల రిజిస్ట్రేషను పుస్తకాలు స్టాపేజీ రిపోర్టును జతపరచివుండని కారణాన తిరిగి క్రొత్త చట్టంలో చెప్పబడిన విధంగా జత పరుపనందున రాష్ట్ర మందలి లైసెన్సింగు అధికార్లందరూ పెనాల్టీలతోసహా రాష్ట్రమందన్ని ఆగివున్న బండ్లపైన డి. సి. బి. రిజిష్టరు ప్రకారం పన్ను వసూలునకు డిమాండ్లు తయారు చేసినారు. ఆయా లైసెన్సింగ్ అధికారుల ఇతర రెకార్డులలోను, పర్మిట్లు లేకున్ననూ బ్రేకు ఫిట్‌నెస్ లేకున్ననూ ఆగివున్నట్లు గుర్తింపు జరిగివున్నను కేవలం రిజిస్ట్రేషను పుస్తకం తమకు 1-4-63 నాటికి చేరలేదని డిమాండ్లు తయారు చేశారు. అదే విధంగా చాలాకాలం లోగడనే కండెం చేయబడి వాడుకలో లేనటువంటి మోటారు బండ్లకు కూడా పన్నుడిమాండ్లు తయారుచేశారు. ఆఫీసుల్లో 'బి' రిజిష్టర్లులో నమోదైన ఆధారాలను పురస్కరించుకొని యితర విధమైన పరిశీలనలేక చేయబడిన యీ పన్ను డిమాండ్ల విషయంలో ఆపరేటర్లు బాధ్యులనటం సబబుకాదు. ఒక్క-

కడపజిల్లాలో అధికారులు యిచ్చిన పన్ను వసూలు డిమాండు 5 లక్షల రూపాయలకు మించివుంది.

1939 మోటారు బండ్ల చట్టం క్రింద వాడబడే (లేక) వాడికకు వుంచబడే ట్రాన్సుపోర్టు బండికి కావలసిన ముఖ్యాంగాలలో బ్రేకు ఫిట్‌నెస్ పర్మిట్టు. పన్ను చెల్లింపు. వీనిలో ఏవి లేకున్నా అట్టి బండ్లు వాడుకకు సిద్ధముగా వుంచబడని వానిక్రిందే జమ. మోటారుచట్టంలో చెప్పడిన విధానం ప్రకారం బ్రేక్ ఫిట్‌నెస్ లేని ఏ ట్రాన్సుపోర్టుబండి కూడా వాడుకకు సరిపడే లాగు రిజిష్టరుచెయ్యబడనట్లు గుర్తింపబడి యున్నది. కాబట్టి రోడ్డు సర్వీసునకు యోగ్యమని గుర్తించిన మోటారు బండ్ల విషయంలో మాత్రమే క్రొత్తచట్టంలో చెప్పిన వాడుకకు వుంచబడిన బండి అనే పదం వర్తిస్తుంది. కాబట్టి తప్పుడు అర్థంతో గమనింపబడి వసూలుచేయటానికని సిద్ధంచేయబడిన పన్నుడిమాండు ఆంధ్రప్రదేశ్ ట్రాన్సుపోర్టు అపరేటర్లపై అన్యాయంగా ప్రభుత్వం బనాయించి వసూలుచేయజూచే సొమ్ముగా చెప్పవచ్చును. రూలు 12 లో చెప్పిన విధానమంతా వాడుకకు పనికివచ్చే మోటారుబండ్ల విషయంలోనని గుర్తింపవలసిన అగత్యమెంతేనివుంది. కాబట్టి ప్రభుత్వంవారు యీ అన్యాయపు హంగామా పన్నువసూలు విధానాన్ని నిరోధిస్తూ ఆపరేటర్లకు రక్షణ కల్పించే నిమిత్తం వెంటనే "వాడుకకు వుంచబడిన మోటారుబండ్లు" అన్నపదాన్ని విపులీకరించి పై అవాంతరపు పన్ను వసూలు విధానంలో మార్పిడి తీసుకరావలసిన అవసరం ఎంతేని గలదు. ముఖ్యమంత్రి గారు, రవాణా మంత్రి గారు దయతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమందలి మోటారు ఆపరేటర్ల బాధలు గమనించి పాలనాధికారులకు వెంటనే లోగడచేసిన డిమాండ్ల ఉపసంహారింపును ఆదేశిస్తూ లోగడనుండే ఆగివున్న బండ్ల విషయంలో కావలసిన రిజిస్ట్రేషన్ పుస్తకాలను తెప్పించుకునే అమలుపరచయిస్తూ 1-4-63 నుండి 31-12-63 దాకా యీ క్రొత్త టాక్సేషన్ చట్టాన్ని అచరలుమపటం నిలుపుదల చేయవలసిందిగా ఆదేశాలు పంపాలని కోరుచున్నాము. పన్నులు చెల్లించేందుకు ప్రతి మూడు నెలలకు 15 రోజులు గడువు లేక చెల్లింపు వ్యవధిగా ప్రభుత్వంవారు వసతి కల్పించినట్లే స్టాపేజి చేసిన మోటారుబండ్ల రిజిస్ట్రేషన్ పుస్తకాలు దాఖలుచేయు విషయంలో కూడా వ్యవధి కల్పించాలని కోరడమైనది. రాష్ట్రప్రజలందరికి సంబంధించిన ఈవిషయాన్ని చిన్నదిగా భావించి త్రోసిపుచ్చక ముఖ్యమంత్రి గారు, రవాణా మంత్రిగారు తగుశ్రద్ధతో పరిశీలించి తగిన రక్షణ కల్పించాలని అభ్యర్థించడమైనది.



# THE VIZIAWADA CO-OPERATIVE CENTRAL BANK, LIMITED,

## VIJAYAWADA - 2

Phone No 262 Estd. 1918 Post Box No 368

.nches: Jaggayyapet (P.O) Nuzvid (P.O)
Vuyyuru 'P.O) Tiruvur (P.O]

Bankers to all the Cooperative Societies in the West Krishna District

This is 'A' Class Central Bank.

1. Fixed deposits are received at the follwing rates -

| | Below Rs 5000/- | Rs 5000/- and over |
|---|---|---|
| 1 to 3 months .... | $3\frac{3}{4}$% P. A. | 4 % P.A |
| 6 months .... | 4 % ,, | $4\frac{1}{4}$% ,, |
| 12 months .... | $4\frac{1}{4}$% ,, | $4\frac{1}{2}$% ,, |
| 24 months .... | 4 1/2%,, | $4\frac{3}{4}$% ,, |
| 36 months .... | $4\frac{3}{4}$% ,, | 5% ,, |
| 48 months .... | 5% ,, | 5% ,, |
| 60 mouths and above | 5% ,, | $5\frac{1}{8}$% ,, |

*Special rates of interest for sums of Rs 25,000 and over,*

2) Savings Deposits @ 3% per annum.
Rs 1,000/- can be withdrawn in a Calender week.
Cheque Books are issued.
3) Current Deposits @ 1/2% per anuum.
(4) Recurring Deposits @ 4 to 5% per annum.
Cheques and drafts issued at reasonable rates on Madras Bombay, Calcutta, Hyderabad, New Delhi, and on all other important Towns in Andhra Pradesh.

Particulars can be had from the Secretary.

S.V. KRISHNA MURTY, M.A., Secretary

E.B.V.RAGHAVAIAH B.A., President,

## వినోదయాత్రికులకు ప్రత్యేక హొటళ్ళు
### కార్పొరేషన్ ఏర్పాటుకు యోచన
### రవాణామంత్రి వెల్లడి.

వినోదయాత్రా వ్యవహారాల సంఘము సూచించిన పద్ధతిలో ఒక కార్పొరేషనును వ్యవస్థీకరించటాన్ని గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నదని రవాణాశాఖమంత్రి శ్రీ రాజ్ బహదూర్ నేడు రాజ్యసభలో శ్రీ ఎస్.సి. కాస్లివాల్ ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. యిలాంటి కార్పొరేషను వినోదయాత్రికులను గురించి తీసుకొనవలసిన చర్యలలో హోటళ్ళ నిర్మాణము, యింకా కొన్ని యితరఅంశాలు ఉన్నాయి.

విదేశాలనుంచి వచ్చే వినోదయాత్రికులు, సారాకోసం పర్మిట్లు సంపాదించుకొనడానికి కొన్ని సమయాలలో యిబ్బందులకు లోనవుతున్నమాట నిజమేనని శ్రీ ఎం.సి. షా కుమంత్రి చెప్పారు.

వినోద యాత్రికులకు హోటళ్ళను నిర్మించటానికి ప్రభుత్వం అనేక సదుపాయాలు చూపించినా ప్రైవేటు పెట్టుబడిదారులు ఎవరూ ముందుకు రాలేదంటూ, యీ లోటును భర్తీ చేయటానికి ఒక కార్పొరేషన్ స్థాపననుగురించి ఆలోచిస్తున్నామనీ, హోటల్‌లో వసతి కల్పించే పని కూడా ఆ కార్పొరేషన్ చూడవచ్చుననీ శ్రీ రాజబహదూర్ తెలియజేశారు.

ముఖ్యంగా బొంబాయి, ఢిల్లీ, కలకత్తా ఆగ్రా, వారణాసి, అజంతా, ఎల్లోరాలలో తగినంత వసతి సదుపాయం లభించడం లేదన్నారు.

---

### కృష్ణాజిల్లా లారీ ఓనర్సు సంఘం.

16-11-1963 తేదీ శనివారం సాయంత్రం 4 గంటలకు కృష్ణా జిల్లా లారీ యజమానుల సంఘ కార్యవర్గ సమావేశము అసోసియేషన్ ఆఫీసునందు శ్రీ జి. సూర్యనారాయణగారి అధ్యక్షతను సమావేశమయి యీ క్రింది తీర్మానమును ఏకగ్రీవముగా ఆమోదించటమైనది.

తీర్మానము:- అసెంబ్లీ సభ్యుడు, ప్రముఖ కాంగ్రెసువాది నిష్కళంక దేశభక్తుడు, మోటారు ఫీల్డులో అనుభవశాలి, లారీయజమాని అయిన శ్రీ చెన్నుపాటి రామకోటయ్య గారు 14-11-63వ తేదీ రాత్రి అకాలమృత్యువు పొందినందున మోటారు ఫీల్డుకు తీరని లోటు సంభవించినది. వారి కుటుంబమునకు గాఢ సంతాపమును ఈ కమిటీవారు తెలియచేయుచు వారి ఆత్మకు భగవంతుడు శాంతిని ప్రసాదించుగాక అని కోరుచున్నారు.

సం॥ జి. సూర్యనారాయణ


మా ఖాతాదారులందరకు

సంక్రాంతి శుభాకాంక్షలు

మా వద్ద అన్నిరకములైన బియ్యము సరసమైన ధరలకు లభించును.

శ్రీనివాసా రైస్ స్టోర్సు

ఆంధ్రరత్న రోడ్ • హనుమాన్‌పేట

విజయవాడ - 3.

### ట్రాన్సుపోర్టు కమీషనరుగారికి గుంటూరుజిల్లా లారీ, బస్సు ఓనర్సు సమర్పించిన

# మెమోరాండం

1. ఆగివున్న మోటారుబండ్లపై, పన్ను, పెనాల్టీ వసూలు.

1963 సం॥లో క్రొత్తగా వచ్చిన మోటారు బండ్ల పన్నుల చట్టములోని 3వ సెక్షన్ ప్రకారం, వాడబడే మోటారు బండ్లకు – వాడబడటానికి సిద్ధంగా ఉంచే మోటారు బండ్లకు పన్ను వసూలు చేయాలి. లోగడ ఆగి వున్న బండ్లకు – స్టాపేజి రిపోర్టు మాత్రము – ఇవ్వడమనేది ఆచారంలో వున్నది. దానిని మోటారు వెహికిల్ ఇన్స్పెక్టరు ద్వారా పరిశీలింపజేసి అట్టి బండ్లకు పన్ను వసూలు చేసేవారు గాదు. కానీ – నేడములులో వున్న పన్నుల చట్టం ప్రకారం — 12వ రూలు ననుసరించి – స్టాపేజీ రిపోర్టుతో పాటు – ఆయా బండ్ల రిజిస్ట్రేషన్ పుస్తకాలు అధికారుల కంద జేయనిచో – డిమాండు తయారు చేయబడుతుంది. 1-4-63 నాటికే ఆగివుండి — స్టాపేజీ రిపోర్టులద్వారా సదరు మోటారు బండ్ల నిలుపుదల అధికారులకు తెలిసి వున్నప్పటికీ –క్రొత్త చట్టము ప్రకారం,రిజిస్ట్రేషన్ పుస్తకం రాలేదని పన్నుల డిమాండును పెనాల్టీతో సహా పెంచి వేశారు.

ఇట్టి అప్రస్తుత డిమాండ్ల నుపసంహరిస్తూ ప్రభుత్వమువారు సదరు మోటారు బండ్ల నిలుపుదలను గూర్చి బేక్ ఇన్స్పెక్టర్లద్వారా– సమాచార సేకరణ జరిపి అనవసరంగా మాకు కల్గిన ఇబ్బందిని తొలగింప కోరడమైనది, అంతేగాక– ప్రభుత్వమువారు 12 వ రూలును – పన్నుల చట్టంలో మార్పుచేసి ఆగివున్న బండ్ల విషయంలో – స్వయంగా తెలుసుకొని –సమాచారమిచ్చే బాధ్యత ప్రభుత్వాధికార్లకే వదలవలసిందిగా కోరడమైనది.

2. ఇక, బస్సుల విషయంలో – డొంక సర్వీసులపై –తిరిగే బస్సులు కానీ, దేశమంతా తిరగటానికి వీలున్న లారీలుగాని, నిర్ణీతమైన కాలంలో – అనేక – ఇతర ఇబ్బందులవల్ల వారివారి రిజిస్ట్రేషన్ పుస్తకాలు – ఆఫీసులలో స్టాపేజీతో సహా దాఖలుచేయటానికి కొంత ఆలస్యము జరుగవచ్చు. అట్టిపరిస్థితులలో – సదరు సి. పుస్తకాన్ని – స్టాపేజీ రిపోర్టునకు జతపరిచేందుకు – దూరంలో ఆగివున్న స్థానం నుంచి తెచ్చేలోగా అయ్యే కాలహరణాం గమనించి ప్రభుత్వాధికార్లు స్టాపేజీని గుర్తించటం ముఖ్యమని కోరడమైనది.

3. ప్రభుత్వమువారు ఈమధ్య జారీచేసిన ఉత్తర్వు ప్రకారం, 1-1-64 నాటికి – ప్రతి మోటారు బస్సు – డన్‌లప్ రబ్బరు సీట్లను కల్గివుండవలసిన అగత్యం – విషమసమస్యగా పరిణమించింది. ముఖ్యంగా రాష్ట్రంలో ఉన్న మోటారుబండ్లన్నిటికీ, కొద్దికాలవ్యవధిలో – కంపెనీవారు రబ్బరు సీట్లు సప్లయిచేయగలరా యన్నదే ప్రశ్న. అంతేగాక ఈనాటి ఒడుదుడుకుల ఆర్థిక స్థితిలో ఆపరేటరునకు ఇదియొక అదనపు బరువు. ప్రభుత్వంవారు దీన్ని గమనించి తగిన అవకాశం దయచేయించాలని కోరడమైనది. ప్రభుత్వపు ఖజానాలో చెల్లించిన సొమ్ముకు గుర్తుగా ఇచ్చే ఒరిజినల్ చలానా రశీదు ఏ కార

ణాములవల్లనైనా పోగొట్టుకున్న ఆపరేటరు తిరిగి సొమ్ము చెల్లించవలసి వుండుటవలన నేడు సాగుతున్న క్రెడిట్ సర్టిఫికేట్ల నిరాకరణ పద్ధతి ప్రభుత్వంవారు తొలగించాలని కోరడమైనది

పై మెమోరాండంను — ట్రాన్సుపోర్టు కమీషనరుగారికి, శ్రీయుతులు డి. పుండరీకాక్షరావు, ఎన్. నాగేశ్వరరావు, ఎన్. బసవయ్య, రాధాపంతులు, సి. యన్. రామశర్మ, వగైరా ఆపరేటర్లు స్వయంగా అందజేసి వారికి విపులంగా విషయాలన్నిటిమీదా వివరించి చెప్పిరి. కమీషనర్‌గారు శ్రద్ధగా ఆలకించి, తప్పకవీలైన సహాయము చేయుగలనని చెప్పిరి. ఇదేమెమోరాండంను తెనాలిలో రవాణా మంత్రిగారికి పై సంఘంవారు అందజేసిరి.




మా ఖాతాదారులందరకు నూతనసంవత్సర

శుభాభినందనలు

TEL. DHEEMA PHONE NO 974

Sri Seetharama
Lorry Supply Office

Prop: K SEETHARAMAIAH,
Canal Road ; : VIJAYAWADA-1

శ్రీసీతారామా లారీసప్లయి ఆఫీసు

కెనాల్ రోడ్ ; : విజయవాడ - 1



నూతన సంవత్సర శుభాకాంక్షలు

ప్రముఖ విదేశ దర్జీసంస్థ - జాన్ బాట్టన్
లిమిటెడ్ ప్రశంశలనందుటయేగాక
జెమినీ, శ్రీగజానన, ఎన్ ఏ. టి మరియు
రాజా ప్రొడక్షన్స్
మొదలయిన సినిమా సంస్థలకు



విజయవాడ టైలర్స్ అసోసియేషన్ నిర్మాణ
సూత్రధారి
తనదర్జీపనిచే దర్జా కూర్చిపెట్టిన
మాష్టర్ టైలర్ & కట్టర్,

శ్రీరామకృష్ణ
టైలరింగ్ హాల్

ఏలూరు రోడ్ • విజయవాడ-2

## ఆర్. టి. సి. పనివారికి నివాసగృహాల నిర్మాణం విజయవాడలో శ్రీ కటారీచే

# కాలనీకి ప్రారంభోత్సవం.

రోడ్ ట్రాన్సుపోర్టు కార్పొరేషన్ ఆదాయం ఎక్కువై ఖర్చులు తగ్గినప్పుడు పనివారికిఎక్కువ సౌకర్యాలు కలగజేయడానికి వీలుగా వుంటుందని ఆర్. టి. సి. చైర్మన్ శ్రీ ఆర్. డి. కటారీ అన్నారు.

విద్యాధరపురంలో పనివారు, సిబ్బంది సమావేశంలో ఆయన ప్రసంగించారు. తరవాత కొత్త నివాస గృహాలను ప్రారంభించారు. పనివారికి నివాస గృహాలు ఏర్పాటు చేయడం ఈ ప్రాంతంలో ఇదే మొదటిసారి అనీ, డిపో వున్న ప్రతిచోటా, పనివారికీ, సిబ్బందికీ, నివాసగృహాలను ఏర్పాటు చేయాలని తాను ఆశిస్తున్నాను అనీ ఆయన అన్నారు. ప్రస్తుతం కార్పొరేషన్ ఆర్థిక పరిస్థితి తన కోర్కెను నెరవేర్చడానికి అనుకూలంగా లేదనీ, పనివారూ, సిబ్బందీ కార్పొరేషన్ ఆదాయాన్ని అభివృద్ధి చేసేందుకు గట్టి కృషి చేయాలనీ అలాచేస్తూ ఖర్చులను కూడా తగ్గించడానికి ప్రయత్నించాలనీ ఆయన కోరారు. మెకానిక్ నుంచి ప్రతి ఒక్కరూకూడా బస్సుల నిర్వహణను సక్రమంగా కొనసాగిస్తూ నష్టం కలుగనీయకుండా చూడాలన్నారు. డ్రైవర్లు తెలివి తేటలతో బస్సులను నడుపుతూ పెట్రోలు ఖర్చును తగ్గించాలన్నారు. బస్సు సర్వీసులు క్రమం తప్పకుండా వేళకు నడవా లన్నారు. ఇలా చేస్తే కార్పొరేషన్ ఆర్థిక,పరిస్థితి అభివృద్ధి కాగల దన్నారు.

ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ. వి. రామారావు ఈ సభకు అధ్యక్షత వహించారు.

కార్పొరేషన్ ప్రభుత్వరంగంలో వుండడం చేత పనివారికి వసతి సౌకర్యం లభించిందనీ, ప్రైవేటు వ్యక్తుల చేతిలో వుంటే ఇది జరిగి వుండేది కాదన్నారు.

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ వేణుగోపాలరావు నివేదికను సమర్పిస్తూ విద్యాధరపురంలో క్వార్టర్సు 34 యకరాల భూమిలో నిర్మిస్తారనీ, కార్మిక శాఖనుంచి 24 యకరాలు సంపాదించామనీ చెప్పారు.

ప్రస్తుతం 50 యూనిట్లు మంజూరు అయినాయన్నారు.

అసిస్టెంటు ఇంజనీరు శ్రీ. వి. కృష్ణారావు అభినందనలు తెల్పారు.

శ్రీ కటారీ రిబ్బను కత్తిరించి ఒకమొక్కను నాటారు. తర్వాత ఆయన వసతి గృహాల కాలనీని చూశారు. ఆటలకు కేటాయించిన స్థలాన్ని చూశారు.

పత్రికల వారితో మాట్లాడుతూ, నిపుణులైన పనివారి కొరత, బస్సుల నిర్వహణ సౌకర్యాలు లేకపోవడం ప్రస్తుతం కొన్ని లోపాలకు కారణమని శ్రీ కటారీ తెలియజేశారు. పరిస్థితి మెరుగవుతున్నదనీ, ముందు ముందు బాగా అభివృద్ధి కాగలదనీ ఆయన అన్నారు.

విద్యాధరపురంలో పనివారి శిక్షణ కేంద్రం వర్కు-షాపులు నెలకొల్పడం వల్ల పరిస్థితి మెరుగు కాగలదని ఆయన చెప్పారు.

కండక్టర్లు డ్రైవర్లు అమర్యాదగా ప్రవర్తిస్తున్న విషయాన్ని గురించి తెలియజేయగా, వారికి ప్రయాణీకుల పట్ల మర్యాదగా ప్రవర్తించమని తాను చెప్పినట్లు శ్రీ కఠారీ తెలియజేశారు.

కండక్టర్లు డ్రైవర్లు బస్సులలో పొగత్రాగుతున్నారనీ, ఈ విషయంలో తాను గట్టి ప్రయత్నం చేసి బస్సులలో పొగత్రాగే అల వాటును నిరోధించటానికి ప్రయత్నించగలననీ శ్రీ కఠారీ చెప్పారు.

విజయవాడలో ప్రజా సంబంధాల శాఖ అధికారిని ఒకరిని నియమించాలనీ పత్రికల వారు సూచించారు.




నూతన సంవత్సర శుభాకాంక్షలు

## ది యునిక్ మోటార్ అండ్ జనరల్ యిన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

హెడ్డాఫీసు : బొంబాయి          డివిజనల్ ఆఫీసు : విజయవాడ

రైలు, రహదారి, సముద్ర ప్రయాణములలో సంభవించు ప్రమాదముల నుండి మీరు రక్షణ పొందుటకు ;
మోటారు కార్లు, లారీలు, మోటారుసైకిళ్ళు, సైకిళ్ళు, సైకిలురిక్షాలు, వాన్లు మొదలయిన వాహనములను రహదారి ప్రమాదమునుంచి రక్షించుకొనుటకు;
శాశ్వత అంగవైకల్య స్థితిలో మీ జీవనోపాధి నిమిత్తము యునిక్ మోటార్ అండ్ జనరల్ యిన్సూరెన్సు కంపెనీలో భీమా చేయండి.

ఏజంట్లు లేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను.

మీ సౌకర్యము కొరకు గుడివాడ పట్టణమున ఒక రెసిడెన్షియల్ ఆఫీసు 19-11-63 తేదీన నెలకొల్పబడినదని తెల్పుటకు మిక్కిలి సంతసించుచున్నాము.

రోడ్ల అభివృద్ధికి కేటాయింపు పెంపు.

తృతీయ ప్రణాళికలో రోడ్లు, రేవులు అంతరంగిక జలమార్గాల అభివృద్ధి మొదలైన కొన్ని పద్దుల క్రింద కేటాయింపులు హెచ్చింపబడినట్లు రవాణామంత్రి శ్రీ రాజబహదూర్ నేడు లోక్‌సభలో ప్రకటించారు.

ఆ హెచ్చింపులు ఈ విధంగా వున్నాయి;

(1) రోడ్లు రు 272 కోట్లనుంచి 416 కోట్ల 80 లక్షలు.

(2) రేవులు 86 కోట్ల 50 లక్షలనుంచీ 110 కోట్ల 60 లక్షలు.

(3) అంతరంగిక జలమార్గాల అభివృద్ధి 5 కోట్ల 50 లక్షలనుంచి 6 కోట్ల 50 లక్షలు.

♦♦♦

## కృష్ణానదిపై రెండవ రైలు వంతెన నిర్మాణం

కృష్ణానదిపై రెండవ రైలు వంతెన నిర్మాణం 1964 సంవత్సరాంతానికి పూర్తి కావచ్చుననీ, గుడ్సుబండ్ల రాకపోకలు అప్పటినుండి ప్రారంభం కాగలవనీ, రైల్వే శాఖ డిప్యూటీ మంత్రి శ్రీ ఎస్. వి. రామస్వామి నేడు లోక్‌సభలో శ్రీ ఈశ్వరరెడ్డి అడిగిన ప్రశ్నకు వ్రాత పూర్వకంగా సమాధానం ఇస్తూ తెలియజేశారు.

ఖమ్మంమెట్టు- డోర్నకల్ మధ్య ప్రయాణీకుల నిమిత్తం రెండవ రైలు మార్గం 1964 మార్చినాటికి పూర్తి కాగలదనీ మరొకప్రశ్నకు సమాధానం ఇస్తూ ఆయన తెలియజేశారు.

ఈ యేడాది వర్షాకాలం చివరి దశలో హెచ్చు వర్షాలు పడటంవల్ల రైలుకట్టవద్ద కంకర వేసే కార్యక్రమం ఇంతవరకు పూర్తికాలేదని, దీనివల్ల రైలు మార్గం నిర్మాణం ఆలస్యమయిందని ఆయన అన్నారు.

♦♦*

## 1965 నాటికి మద్రాసువద్ద ఫ్యాక్టరీలో టాంకుల ఉత్పత్తి

మద్రాసువద్ద ఫ్యాక్టరీలో మొదట అనుకున్న ప్రకారమే 1965 నాటికి టాంకుల ఉత్పత్తి ప్రారంభం కాగలదని తెలుస్తున్నది. రక్షణపరికరాల ఉత్పత్తి శాఖామంత్రి శ్రీ కె రఘురామయ్య ఇటీవల ఆవడివద్ద గల భారీ శకటాల కర్మాగారాన్ని సందర్శించి తిరిగి నిన్న ఇక్కడికి వచ్చారు మొదట నిర్ణయించుకున్న ప్రకారం 1965 నాటికి టాంకుల ఉత్పత్తి ప్రారంభం కాగలదనే అభిప్రాయాన్ని ఆయని వ్యక్తపరిచారు.

♦♦♦

## నల్గొండ బస్సు స్టాండులో సౌకర్యాలు.

నల్గొండ బస్సు స్టాండులో విశ్రాంతిగదులు, మంచినీటి సప్లయి సౌకర్యాలు కలుగజేయవలసిందిగా రోడ్డు రవాణా సంస్థవారిని అభ్యర్థించడానికి బస్ ప్రయాణీకుల సంఘం తీర్మానించింది.

మునిసిపల్ చైర్మన్ శ్రీ. టి వెంకటనారాయణ అధ్యక్షుడుగా నల్గొండ బస్ ప్రయాణీకుల సంఘం ఏర్పాటయింది. శాసనమండలి సభ్యుడు శ్రీ సి. హెచ్. శంకరరావు సంఘానికి ముఖ్యసలహాదారు, శ్రీ. జె. వి. యన్. శాస్త్రి కార్యదర్శిగా ఎన్నిక అయ్యారు.

నల్గొండనుండి విజయవాడకు సరాసరి బస్సు వేయాలని, హైదరాబాదు - గుంటూరు బస్సులను మల్లపల్లి మీదుగా కాక, నల్గొండ మీదుగా మళ్ళించాలనీ అభ్యర్థించడానికి సంకల్పించారు.

విద్యాధరపురంలో పనివారి శిక్షణ కేంద్రం వర్కు-షాపులు నెలకొల్పడం వల్ల పరిస్థితి మెరుగు కాగలదని ఆయన చెప్పారు.

కండక్టర్లు డ్రైవర్లు అమర్యాదగా ప్రవర్తిస్తున్న విషయాన్ని గురించి తెలియజేయగా, వారికి ప్రయాణీకుల పట్ల మర్యాదగా ప్రవర్తించమని తాను చెప్పినట్లు శ్రీ కటారీ తెలియజేశారు.

కండక్టర్లు డ్రైవర్లు బస్సులలో పొగత్రాగుతున్నారనీ, ఈ విషయంలో తాను గట్టి ప్రయత్నం చేసి బస్సులలో పొగత్రాగే అలవాటును నిరోధించటానికి ప్రయత్నించగలననీ శ్రీ కటారీ చెప్పారు.

విజయవాడలో ప్రజా సంబంధాల శాఖ అధికారిని ఒకరిని నియమించాలనీ పత్రికల వారు సూచించారు.



నూతన సంవత్సర శుభాకాంక్షలు

ది యునిక్ మోటార్ అండ్ జనరల్ యిన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

హెడ్డాఫీసు : బొంబాయి    డివిజనల్ ఆఫీసు : విజయవాడ

రైలు, రహదారి, సముద్ర ప్రయాణములలో సంభవించు ప్రమాదముల నుండి మీరు రక్షణ పొందుటకు ;

మోటారు కార్లు, లారీలు, మోటారుసైకిళ్ళు, సైకిళ్ళు, సైకిలురిక్షాలు, వాన్లు మొదలయిన వాహనములను రహదారి ప్రమాదమునుంచి రక్షించుకొనుటకు;

శాశ్వత అంగవైకల్య స్థితిలో మీ జీవనోపాధి నిమిత్తము యునిక్ మోటార్ అండ్ జనరల్ యిన్సూరెన్సు కంపెనీలో భీమా చేయండి.

ఏజంట్లు లేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను.

మీ సౌకర్యము కొరకు గుడివాడ పట్టణమున ఒక రెసిడెన్షియల్ ఆఫీసు 19-11-63 తేదీన నెలకొల్పబడినదని తెల్పుటకు మిక్కిలి సంతసించుచున్నాము.

రోడ్ల అభివృద్ధికి కేటాయింపు పెంపు.

తృతీయ ప్రణాళికలో రోడ్లు, రేవులు అంతరంగిక జలమార్గాల అభివృద్ధి మొదలైన కొన్ని పద్దుల క్రింద కేటాయింపులు హెచ్చింపబడినట్లు రవాణామంత్రి శ్రీ రాజబహదూర్ నేడు లోక్ సభలో ప్రకటించారు.

ఆ హెచ్చింపులు ఈ విధంగా వున్నాయి;

(1) రోడ్లు రు 272 కోట్లనుంచి 416 కోట్ల 80 లక్షలు.

(2) రేవులు 86 కోట్ల 50 లక్షలనుంచీ 110 కోట్ల 60 లక్షలు.

(3) అంతరంగిక జలమార్గాల అభివృద్ధి 5 కోట్ల 50 లక్షలనుంచి 6 కోట్ల 50 లక్షలు.

♦♦♦

## కృష్ణానదిపై రెండవ రైలు వంతెన నిర్మాణం

కృష్ణానదిపై రెండవ రైలు వంతెన నిర్మాణం 1964 సంవత్సరాంతానికి పూర్తి కావచ్చుననీ, గూడ్సుబండ్ల రాకపోకలు అప్పటి నుండి ప్రారంభం కాగలవనీ, రైల్వే శాఖ డిప్యూటీ మంత్రి శ్రీ ఎస్. వి. రామస్వామి నేడు లోక్ సభలో శ్రీ ఈశ్వరరెడ్డి అడిగిన ప్రశ్నకు వ్రాత పూర్వకంగా సమాధానం ఇస్తూ తెలియజేశారు.

ఖమ్మంమెట్టు- డోర్నకల్ మధ్య ప్రయాణీకుల నిమిత్తం రెండవ రైలు మార్గం 1964 మార్చినాటికి పూర్తి కాగలదనీ మరొకప్రశ్నకు సమాధానం ఇస్తూ ఆయన తెలియజేశారు.

ఈ యేడాది వర్షాకాలం చివరి దశలో హెచ్చు వర్షాలు పడటంవల్ల రైలుకట్టవద్ద కంకర వేసే కార్యక్రమం ఇంతవరకు పూర్తికాలేదని, దీనివల్ల రైలు మార్గం నిర్మాణం ఆలస్యమయిందని ఆయన అన్నారు.

♦♦*

## 1965 నాటికి మద్రాసువద్ద ఫ్యాక్టరీలో టాంకుల ఉత్పత్తి

మద్రాసువద్ద ఫ్యాక్టరీలో మొదట అనుకున్న ప్రకారమే 1965 నాటికి టాంకుల ఉత్పత్తి ప్రారంభం కాగలదని తెలుస్తున్నది. రక్షణపరికరాల ఉత్పత్తి శాఖామంత్రి శ్రీ కె రఘురామయ్య ఇటీవల ఆవడివద్ద గల భారీ శకటాల కర్మాగారాన్ని సందర్శించి తిరిగి నిన్న ఇక్కడికి వచ్చారు మొదట నిర్ణయించుకున్న ప్రకారం 1965 నాటికి టాంకుల ఉత్పత్తి ప్రారంభం కాగలదనే అభిప్రాయాన్ని ఆయని వ్యక్తపరిచారు.

♦♦♦

## నల్గొండ బస్సు స్టాండులో సౌకర్యాలు.

నల్గొండ బస్సు స్టాండులో విశ్రాంతిగదులు, మంచినీటి సప్లయి సౌకర్యాలు కలుగజేయవలసిందిగా రోడ్డు రవాణా సంస్థవారిని అభ్యర్థించడానికి బస్ ప్రయాణీకుల సంఘం తీర్మానించింది.

మునిసిపల్ చైర్మన్ శ్రీ. టి వెంకటనారాయణ అధ్యక్షుడుగా నల్గొండ బస్ ప్రయాణీకుల సంఘం ఏర్పాటయింది. శాసనమండలి సభ్యుడు శ్రీ సి. హెచ్. శంకరరావు సంఘానికి ముఖ్యసలహాదారు, శ్రీ. జె. వి. యస్. శాస్త్రి కార్యదర్శిగా ఎన్నిక అయ్యారు.

నల్గొండనుండి విజయవాడకు సరాసరి బస్సు వేయాలని, హైదరాబాదు – గుంటూరు బస్సులను మల్లెపల్లి మీదుగా కాక, నల్గొండ మీదుగా మళ్ళించాలనీ అభ్యర్థించడానికి సంకల్పించారు.

టెలిగ్రాములు, ట్రంక్ కాల్సు, తీసుకోవడంలో జాప్యం.

టెలిగ్రాములు, ట్రంకుకాల్సు, ఫోనోగ్రాములను తీసుకొనడంలో జరిగే జాప్యానికి బాధ్యులయిన అధికారులపై సకాలంలో చర్య తీసుకోవడం జరుగుతుందని కేంద్ర తంతి, తపాలా శాఖ సలహామండలి సమావేశంలో వాగ్దానం చేయబడింది. రెండు రోజుల సమావేశం మొన్న ఇక్కడ సమాప్తమయినది.

ఈ సమావేశంలో దేశంలో తంతి తపాలా సౌకర్యాలను మరింత కట్టుదిట్టంగా వృద్ధిచేయడానికి సంబంధించిన అనేక అంశాలను పరిశీలించారు. టెలిగ్రాములు, ట్రంకుకాల్సు బుకింగులో జరిగే జాప్యానికి సంబంధించిన కేసులను త్వరితగతిని విచారించడం జరుగుతుందని కూడా తంతి, తపాలా శాఖ వాగ్దానం చేసింది.

ఈ సమావేశానికి పార్లమెంటు సభ్యులు, రాష్ట్రప్రభుత్వాల, వాణిజ్యమండలుల వార్తా సంస్థ, వార్తాపత్రికలు మొదలగు సంస్థల ప్రతినిధులు కేంద్ర మంత్రిత్వ శాఖల అధికారులు హాజరైనారు.

సిబ్బందికి వసతుల నిర్మాణం ఏర్పాట్లను త్వరితగతిని సాధించే సమస్యను, రాత్రి పోస్టాఫీసుల పద్ధతి విస్తరణ, హిందీలో టెలిఫోన్ డైరక్టరీల ప్రచురణవంటి అనేక సమస్యలను గురించి సమావేశంలో చర్చించారు.

హోటళ్ళలో టూర్యిస్టులకు టెలిఫోన్ సౌకర్యాలు కలుగ జేసే విషయాన్ని "అత్యంత శ్రద్ధగా పరిశీలించగలమని" తంతి, తపాలా శాఖ హామీ యిచ్చింది.

మరింతగా తపాలా, టెలి కమ్యూనికేషన్ సదుపాయాలు కలుగజేయడంలో ప్రజలు సహకరించడం అవసరమని తంతితపాలా శాఖ కేంద్ర ప్రభుత్వ కార్యదర్శి శ్రీ జైన్ చెప్పారు.

---

## రైల్వేల నిర్వహణలో శిబ్బందీ యాజమాన్యం

రైల్వే సిబ్బంది చట్టబద్ధంగా నిర్వహణలో పాల్గొనే సమయం త్వరలో రానున్నదనే ఆశాభావాన్ని కేంద్ర మాజీ కార్మికమంత్రి శ్రీ కండూభాయ్ దేశాయ్ నిన్న ఇక్కడ వ్యక్తం చేశారు.

దక్షిణరైల్వే టికెట్ తనిఖీ సిబ్బంది ప్రత్యేక సమావేశానికి నిన్న సాయంకాలం ఆయన ప్రారంభోత్సవం చేశారు.

రైల్వేలు జనుము, పంచదార, లేక తదితర ఏ పరిశ్రమ నిర్వహణలో చిత్తశుద్ధితో కార్మికులు పాల్గొననిచ్చో, కొనసాగదనీ, ఉత్త నినాదాలు చేసినంత మాత్రంతో సరిపోదనీ, ఈ పద్ధతిని, వాస్తవిక ఆచరణ యోగ్యమైన రీతిలో అమలు పరచాలనీ, భారత రైల్వే సిబ్బంది జాతీయ సమాఖ్య ఈపద్ధతిని అమలుపరచవలసిందిగా, కేంద్ర ప్రభుత్వాన్ని అర్థిస్తున్నదనీ, అప్పుడు రైల్వే సమస్యలను, ఒక్క కుటుంబానికి చెందిన సమస్యలవలె, చర్చించడానికి వీలవుతుందని, సమాఖ్య వివరించిందనీ ఆయన తెలియజేశారు.

టికెట్ లేకుండా ప్రయాణం చేసేవారిబెడద ఏమాత్రం లేకుండా టికెట్ కలెక్టర్లు చూడాలనీ, వీరివలన రైల్వేలకు కోట్లకొలది రూపాయల మేరకు నష్టం వస్తున్నదనీ ఆయన వివరించారు.

ప్రెసిడెంటు కెన్నెడీ మృతికి, భారత సీనియర్ సైనికాధికారుల మరణం పట్ల సమావేశం సంతాపం ప్రకటించింది.

— —



గగనవిహారులు:

గగనవిహారులు వాలెంటినా టెలిష్కోవా, వాలెవా బైకోవిస్కే.

---

గమనిక:- డిశంబరు 1963 సంచికలో ఈ బొమ్మక్రింద ముద్రింపబడిన వ్యాఖ్య యీ చిత్రానికి సంబంధించనిదని దానిలో చివరిపంక్తిలో "అందుకున్నారు క్రొత్తజంట" అని చదువరులు సరిదిద్ది చదువుకోవాలని మనవి.




1963 ఆంధ్రప్రదేశ్ పన్నుల చట్టం క్రింద చేయబడిన మోటారు పన్ను డిమాండ్ల విషయంలో అభ్యంతరమున్న డిమాండ్లను గూర్చి రాష్ట్రప్రభుత్వం వారికి నివేదించుకొనడమే సబబని తద్వారా ప్రభుత్వంవారు అనవసరపు డిమాండ్ల విషయంలో ఔదార్యం చూపించవచ్చునని కాకినాడ రజిన్ డిప్యూటీ ట్రాన్సుపోర్టు కమీషనరు గారు హెచ్చరిక చేశారు.

♦ ♦ ♦

కొద్ది దినాలలోనే ఆంధ్రప్రదేశ్‌లో తిరిగే పబ్లిక్ క్యారియర్ బండ్లకు రాష్ట్రమంతా తిరిగేందుకు వీలుగా పర్మిట్లజారీ సాధ్యపడుతుందని అధికార వర్గాల వల్ల తెలియవచ్చింది.

♦ ♦ ♦

రాష్ట్రంలో ఈనాడు ప్రభుత్వం తరఫున రవాణా రంగంలోని ప్రతినిధులు నేషనల్ సేవింగ్సుకని, రక్షణనిధికని, యీ విధంగా అనేక చందాలు పరిశ్రమదారులవద్ద వసూలుచేయడం గమనింపదగింది. అట్టి వసూలు యితర వ్యావర్తులకు ఖర్చుచేయటం నేర్చుకున్న పరిశ్రమదారులు ప్రభుత్వాధికారులు తలపడి ప్రతి జిల్లా కేంద్ర పట్టణంలో రవాణా శాఖవారి ఆఫీసు పెట్టే నిమిత్తం ఆపరేటర్లకు రెస్టుహౌస్ గాను కలసి పనికి వచ్చే ఏర్పాట్లలో ఒక ట్రాన్సుపోర్టు హౌసు నిర్మాణానికి కృషిచేసి హెచ్చించటం వలన సాలుకు 3 లక్షల రూపాయలు పొదుపు చేయవచ్చును. ప్రభుత్వం దాన్ని గమనించి తగిన రక్షణకు పూనుకోవాలి.

**Happy and prosperous New Year to all our Customers.**

## THE PREMIER INSURANCE COMPANY LIMITED

Head Office : MADRAS

**A Rich and matured Back - ground of 30 years in insurance Business.**

Branch Office- Near Shahensha Mahal; Congress office Road
VIJAYAWADA

S. L. NARAYANA. B.A ,
Branch Manager

నూతనసంవత్సర శుభాకాంక్షలు

GRAMS: MATHAPHOTO PHONES:
Studio : 2118
Residence : 2241

For all Your Photographic needs:

MATHA STUDIOS
మాతా స్టూడియోస్

(Photographers & authorised Photographic Dealers)

Ellore Road Vijayawada - 2
యేలూరురోడ్ విజయవాడ

మీకిదే మా హృదయపూర్వక సుస్వాగతము

శ్రీ వెంకట కనకదుర్గా ఫాన్సీ
& కంగన్‌హాల్

కాళేశ్వరరావుగోడ్ : విజయవాడ 2

మా వద్ద ఫాన్సీవస్తువులు, అన్నిరకముల గాజులు, పెర్ఫ్యూమెంటేషను ఆర్టికల్స్, మరియు ఆటవస్తువులు, సరసమయిన ధరలకు లభించును.

ఒక్కసారి దయచేయుండి

నూతనసంవత్సర శుభాకాంక్షలతో...

—ప్రొప్రయిటరు

అన్నిరకముల కళ్ళజోళ్ళకు



చంద్రా ఆప్టికల్ కంపెనీ
గవర్నరుపేట మార్కెట్టువద్ద
గోపాలరెడ్డి రోడ్ విజయవాడ - 2

చత్వారపు కళ్ళజోళ్ళకు, చలవ కళ్ళజోళ్ళకు
నేడే దయచేయండి

ధరలు సరసము!!

వస్తువులు నాణ్యమైనవి!!!

## మనవి

చందాలు చెల్లింపనివారు వెంటనే సాలు చందా రు. 3-00 పంపప్రార్థన.

ప్రకటనదారులు తమ తమ ప్రకటనలు మాకు ప్రతినెలా 25 వ తేదీలోగా చేరేలాగు పంపవలెను.

రచయితలు తమ రచనలను మాకు 20 వ తేదీకి అందేలాగు పంపవలెను.

సదా మీ సహకారాన్ని ఆశిస్తూ
ఎడిటర్.

# 1964

## నూతన సంవత్సర శుభాకాంక్షలు

గత ఆరు సంవత్సరాల అనుభవానికి అందాలుచిందుతూ ఏడవసంపుటిని సమకూర్చడానికి పాటుపడిన ప్రెస్ పనివారికి, ఉదారతతో అభిమానించే చందా దారులకు, చేదోడు వాదోడుగా సహకరించే ప్రభుత్వంవారికి, ప్రకటనదారులకు, పాఠకమహాశయులకు, పరిశ్రమ యందలి యజమానులకు, పనివారికి నూతన సంవత్సర శుభాకాంక్షలు అందచేస్తున్నాం. పూర్వంవలెనే అభిమానులందరు సహకరింపగలరని కోరడమైనది.

1-1-64
విజయవాడ

జిల్లేపల్లి భాస్కరరావు,
ఎడిటర్ : రవాణాసమాచార్
కాంగ్రెస్ ఆఫీసురోడ్, విజయవాడ - 2

## కృతజ్ఞత

స్వర్గీయులు ఆచార్య వెంకటకృష్ణయ్య గారి జయంతి ఉత్సవసందర్భమున కోరిన వెంటనే వచ్చి శిక్షణకేంద్రమును సందర్శించి గ్రామరాజ్య ప్రాతిపదికగా ఏర్పరుపబడిన కార్యక్రమాల పరిశీలనతోపాటు అంకిత బాలబాలికల శిక్షణా నైపుణ్యాన్ని గమనించి జయంతి సంస్మరణ కార్యక్రమంలో పాల్గొని భావిభారతజీవిత కార్యక్రమాల కనుకూలమై మహోన్నతమయిన సలహాలనందించిన డా॥ కె. యల్. రావుగారికి ఆహ్వానసంఘమువారు, శిక్షణనిలయంవారు వారి కృతజ్ఞత లర్పిస్తున్నారు.



డా॥ కె. యల్. రావు గారు
కేంద్ర జల విద్యుత్ శాఖామంత్రి



## ఆచార్య ఉప్పలూరి వెంకటకృష్ణయ్య గారు

మమ్ము వీడి చనిన మరచిపోలేమయా
జరుపుకొందుము  నీ జయంతి మేము
నీవు చూపినబాట నిజమెరుగుచేనయా
బ్రతుక నందు ప్రతిభ బడయగనుచు!



# జయంతిసంస్మరణ.

రచన:
జిల్లేపల్లి భాస్కరరావు

చిరుతతనాన జీవితము చిక్కుల దక్కిన దక్కగాక నీ
పరువము భాజనంబయి శుభావహ మెంతగ డిల్లవోయినన్
తెరువులెరింగి శాశ్వత ప్రదీప్తికి బాటల జాటినాడ వో
నరవర గ్రామరాజ్యమున కూర్పగ నూత్నవిధాన మెంతయో ! 1

అంకిత బాల బాలికల నందరి దీర్చిన పుణ్యదీక్షలో
నంకితమైన నీ బ్రతుకు నందనమేకద శక్తియుక్తిమై
సంకుల కార్యభారముల చక్కగ దిద్దుచు వ్యక్తి సౌష్టవం
బింక జగాన తారకమటంచును జాటరె ముందు వారికిన్ 2

దేశాలన్ దెగదోపిడిన్ జరిపి ఆశాభూత భావమ్ముతో
నాశమ్మున్ దలపెట్టు వ్యక్తిమత నాశంబీవు వూహించితే
ప్రాశస్త్యంబగు వస్తుమార్పిడిని ప్రారంభంబు గావించుచున్
మోసాలన్ దగు మోసమే అణచుగా కామోద్రేక భగ్నంబుగా! 3

ఆచార్యుండనుమాట నీకె తగునయ్యా యంకితంబైన నీ
వాచాదీక్ష ఫలించెబోలు జగమే వాంఛించె నీనాడు మేల్
సూచస్ఫూర్తిని గ్రామపాలనముకై సోపానముల్ దిద్దుచున్
ఆచార్వ్యేంకటకృష్ణయాఖ్య గనుమయ్యా శాంతి స్వర్గంబునన్ 4

వీరపూజకు నర్హుడ వాంధ్ర ప్రజలు
వేరు భావంబుదలపరు కారునీకు
దూరమేనాడు, యాంధ్రకేసరికి నీవు
చేరువంగన్నవాడవై కూర్మియుంట 5

# సందేశములు:

## శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు

శ్రీ వెంకటకృష్ణయ్యగారు స్వాతంత్ర్యోద్యమ సంరంభము దినాల్లో అనేక కష్ట నష్టముల కోర్చిన దేశభక్తుడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. ఖద్దరుసంస్థాన వ్యవస్థాపకులు. ధర్మకర్త కూడా. వారి జీవిత ఒరవడిని ఆదర్శముగా వుంచుకుని, దేశసేవకు ఉద్యమించ వలసినదిగా ఈనాటి యువకులను కోరుచున్నాను.

(సం) గొట్టిపాటి బ్రహ్మయ్య.

## శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు

శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు మార్పిడి విధానపు ఆర్థికతత్వంలో వస్తు మార్పిడి ప్రధానమని కాగితం నాణెములు తగవని వాదించేవారు. ముఖ్యంగా అన్నింటికి ఖద్దరు చిలపలు ప్రధానమార్పిడివస్తువుగా చేసిన సమాజ జీవనం విప్లవ విధానం అవలంభించగలదని విశ్వసించారు. అది ఒక పరిశీలన. ఈ నాటి విపరీత ధరలు పెరిగిపోతున్న ద్రవ్యోల్బణంలో ధరల స్థిరీకరణ అగుటకు నిజంగా ఆహార ధాన్యాల ధరలు స్థిమితంగా వుంటే తక్కినవి కూడా ఒక సక్రమ పద్ధతిలో నడచుటకు అవకాశం గలదని ఆలోచనలు జరుగుతున్న రోజులలో వీరి పరిశీలన కూడా ఆలోచించ వలసిన అదును.

(సం) వావిలాల గోపాలకృష్ణయ్య.

## శ్రీ సాధు సుబ్రహ్మణ్యంగారు

ఆచార్య వెంకటకృష్ణయ్యగారితో నాకున్న సన్నిహిత సంబంధం నాజీవితంలో మరువ రానిది. ఖద్దరుసంస్థానస్థాపన లగాయతు, వారితో నాకు పరిచయంకలదు. భారతరాజ్యాంగ చట్టము లోని 40 వ ఆర్టికలు పుట్టుటకు శ్రీ వెంకటకృష్ణయ్యగారి మేధస్సే కారణం. ఆంధ్రకేసరికి ఆత్మీ యుడు. పంచాయితీలకు సర్వాధికారాల నిచ్చి, భారతదేశాన్ని వికేంద్రీకరణ సిద్ధాంతము నాధా రము చేసి పాలింపవలెనను ఉద్యమములో ఆచార్యుడు చేసిన అవిరళకృషి మరువలేనిది. ఆయన మాకందరకు ఆచార్యుడే!

(సం) సుబ్రహ్మణ్యం.

# అగ్రగణ్యుడు

రచన :
ప్రభాకర్

గాంధీజీ ఆర్థిక సూత్రాలకు వస్తు వినిమయ పద్ధతి ప్రాదిపదికగా ఉంది. ఈ విధానం యొక్క మూలం మన జీవిత విధానంలోనూ, మన సంస్కృతిలోనూ గట్టిగా వేళ్ళుతన్ని ఉన్నది.

గాంధీజీ ఆర్థిక తత్వాన్ని కార్యక్రమాలకు సమన్వయం చేసి, విడమర్చి మనకు బోధించిన వ్యాఖ్యాత జె. సి. కుమారప్ప. గాంధీజీ ఆర్థిక విధానం మనజాతిపరిపుష్టికి ఉపకరిస్తే అందులో వినిమయ సూత్రమనేది ఆహారంలో ఉప్పువంటి ప్రాముఖ్యం కలది,

స్వర్గీయ వెంకటకృష్ణయ్యగారికి ఈ ఉప్పు పుట్టుకతోనే వచ్చింది. వారు ఉప్పులూరి వారు. ఆయనకు వేరే ఘనం బిరుద మివ్వనక్కరలేదు. ఇంటి పేరే ఆయనకు బిరుదు. ఆయన గొప్పతనాన్ని అదే చాటుతుంది.

గాంధీజీ ఆర్థిక సూత్రాలలో పరిపూర్ణమైన విశ్వాసం కలవారు వెంకటకృష్ణయ్యగారు. ఈ సూత్రాల కొరకే ఆయన జీవించారు. వాని కొరకే ఆయన పని చేశారు. ఆ పనిలోనే ఆయన స్వర్గస్థులైనారు. తన కుటుంబ సభ్యుల నందరినీ తన వంటి నిర్మాణ కార్యకర్తల దళంగా రూపొందించి దేశాని కిచ్చిపోయినా రాయన.

వెంకటకృష్ణయ్యగారితో అనేక సందర్భాలలో సన్నిహితంగా మెలిగే అవకాశం కల్గిన వారిలో నేనొకడను. ఆయన ఏ సభకు రానీ, ఏ సమావేశమునకు రానీ ఒక్కటే సంగతి చెప్పేవారు – భారత రాజ్యాంగంలోని 40 వ సూత్రమును గూర్చి – ఇది వికేంద్రీకరణకు సంబంధించిన సూత్రం – రాజకీయ వికేంద్రీకరణం, ఆర్థిక వికేంద్రీకరణం అన్నిటా వికేంద్రీకరణం– ఇదే ఆయన ప్రసంగాలన్నిటికీ పల్లవిగా ఉండేది. గాంధీజీ చెప్పిన ఆర్థికతత్వం ఆయనకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగాపరిణమించిన దంటే అతిశయోక్తి కాదనుకొంటాను.

ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల చరిత్రలో వెంకటకృష్ణయ్యగారి జీవిత చరిత్ర మరపురాని ఘట్టం. ఈ రాష్ట్రంలోని నిర్మాణ కార్యకర్తలలో ఆయన అగ్రగణ్యుడు.



# వెంకటకృష్ణయ్యగారితో నా పరిచయము,
## వారి సాహచర్యము నా పై కలిగించిన
# ప్రభావము

మానికొండ సత్యనారాయణశాస్త్రి

అది 1921 సంవత్సరం జనవరి – ఫిబ్రవరి నాటి మాట.

ఇప్పటికి 42 ఏండ్లయినది. నేను మదరాసు లా కాలేజీ బి. యల్. క్లాసు నుండి నాన్ కో ఆపరేషన్ చేసి కాళేశ్వరరావు పంతులుగారి ఆహ్వానముమీాద అప్పుడే ఏర్పరుపబడిన జాతీయ పాఠశాలకు హెడ్ మాష్టరుగ బెజవాడ చేరి గవర్నర్ పేటలో మా మామగారగు తుర్లపాటి నరసింహంగారింట నివాస మేర్పరుచుకొంటిని. కాళేశ్వరరావుగారింటికి తరుచు వెళ్ళుచుంటిని. అక్కడ ఉప్పులూరి వేంకటకృష్ణయ్యగారితో ప్రప్రథమ పరిచయ మేర్పడెను. వయస్సులో వారు నా కంటె అయిదు మాసములు చిన్న వారు.

గాంధీగారి నాన్ కోపరేషన్ ఉద్యమము ఉధృతమైన రాజకీయోద్యమము :

బ్రిటిష్ గవర్నమెంటుపై తీవ్రమైన తిరుగు బాటురూపములో అది పైకి నిప్పులుగ్రక్కె రాదగ్ని రూపములోనున్నను,లోపల ప్రశాంతమై నెమ్మదిగ భారత జాతిని సర్వతోముఖమ్ముగ పునర్నిర్మాణము చేసేప్రక్రియగాకూడా ఉండెను.

బ్రిటీషు ప్రభుత్వ బిరుదల బహిష్కరణ మొదలు పన్నుల నిరాకరణ వరకు మెట్లు మెట్లుగ యెక్కి ఒక సంవత్సరంలోపల బ్రిటిష్ గవర్నమెంటును కూలద్రోసే శాంతి యుద్ధ రంగమే నాబోటి యువక ప్రకృతికి ఆకర్షణీయముగ వుండెను. పైకి యెట్టి ఉద్రేకముగాని, ఆడంబరముగాని, లేని ఖద్దరు నిర్మాణము మొదలగు కార్యక్రమములు, ఉప్పు, కారం లేని చప్పని కూరలుగ మాకు రుచించేవికావు.

విదేశీ వస్త్రములు దహనము చేయుట విదేశీ వస్త్ర దుకాణములు పికెటింగు చేయుట వంటి వినాశనాత్మకమైన కార్యములు మాకుహుషారు నిచ్చుచుండెనే కాని ప్రశాంతముగ కూర్చుని రాట్నముల మీాద నూలు తీసే స్వస్థచిత్తత మాకు లేకుండెను. ఖద్దరు మీాద్ద ప్రీతికంటె, బ్రిటిష్‌వాని వస్త్రము మీాద విద్వేషమే మా మనస్సులలో రేగుచుండెను.వీటి అన్నింటికంటే

కూడ జైళ్ళకు దూకుదా మనే వీరకృత్యముల మీదనే మా మనస్సులు తాండవమాడు చుండెను.

ఇట్టి మనస్తత్వముతో వున్న నా బోటివానికి వెంకటకృష్ణయ్యగారు చేపట్టిన ఖద్దరురూప నిర్మాణ కార్యక్రమము వట్టి బెంకుగ కనిపించెను. ఆయన ఏదో మా కంటె తక్కువ పని చేస్తున్నాడనే నిరసనయు మా మనస్సులో ఒక మూల మెలగుచుండెను. ఖద్దరు వంటి చిన్న చిన్న పనులన్నియు స్వరాజ్యం వచ్చిన తరువాత చూచుకోవచ్చులే అనిన్నీ, వీటిఅన్నింటి కంటె మున్ముందు ఇంగ్లీషువాణ్ణి ఇండియా నుంచి తరిమివేయడమే ప్రస్తుత కర్తవ్యమనిన్నీ నేను తలచుచుంటిని. వెంకటకృష్ణయ్యగారు చెప్పుచూవచ్చిన గ్రామ తత్వముకాని, దానిలో భాగమైన ఖద్దరుతత్వము కాని, దానియందిమిడియున్న ఆర్థిక సూత్రముకాని నాకు సుతరాము తెలియలేదు.

ఖద్దరంటే ఇంగ్లీషువాడి వ్యాపారం పడగొట్టి వాణ్ణి ఈ దేశం నుండి తరిమే సాధనగా మాత్రమే నాకు ఆనాడు గోచరించినది. రాట్నము స్వరాజ్య సాధన అనే సూత్రము నాబోటివానికి కొంతవరకే అర్థమైనది. ఈ సూత్రమును నేను అర్థము చేసుకున్న రీతిగానే అయితే స్వరాజ్యం రాగానే రాట్నమును వదలి వేయవలసియే యుండును. స్వరాజ్యం వచ్చిందిగా ఇక రాట్నమెందుకు? — అని ఇటీవల కొందరు అంటున్న మాట ఆనాటి నా బోటి వాని మనస్తత్వమును వ్యక్తపరచుచున్నది.

క్రమక్రమముగ వెంకటకృష్ణయ్యగారి సన్నిహిత పరిచయము వల్లను, యుద్ధోన్మాదము తగ్గి మనస్సుకు సుస్థిరత యేర్పడి సమస్యను సర్వతోముఖముగ జిజ్ఞాస చేసుకొన్న పిమ్మటను ఆనాటి నా అభిప్రాయములు మార్పుచెంది వెంకటకృష్ణయ్యగారి యత్నమే దేశమునకు శాశ్వత శ్రేయస్సును కూర్చే సవ్య మార్గమని నాకు బోధపడినది.

గాంధీగారు చెప్పుచుండిన నిర్మాణ కార్యక్రమములోని అంతరార్థము నాకు గోచరము కాసాగినది. జైళ్ళకు పోవుట, లాఠీ దెబ్బలకు గురి యగుట, శాసనోల్లంఘనము లొనర్చుట వీటన్నింటికంటె ఖద్దరు మొదలగు నిర్మాణ కార్యక్రమమే శాశ్వత శ్రేయస్సుకు మూలమనియు, ఇదే గాంధిగారి అసలు ఉద్యమ రహస్యమనియు నాకు గోచరింప సాగినది. అంతటితో వెంకటకృష్ణయ్యగారు నిజముగ నాకంటె గొప్పవారనే భావము నా మనస్సులో స్థిరపడినది.

మన భారతీయ సంఘ స్థితియు, దానికి పునాదియైన గ్రామ నిర్మాణ పద్ధతులు నేను ప్రశాంతముగ తరచి తరచి 1934-1935 లలో బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో విద్యార్థులతోపాటు కూర్చుని జిజ్ఞాసచేసినకొద్ది వెంకటకృష్ణయ్యగారి మార్గములోనికే నేను రావడం జరిగినది- దానిమీదనే నేను "గ్రామ స్వరాజ్యము" "గ్రామ స్వరాజ్యస్కీము" అనే గ్రంథము రచించి ప్రచురించుటయు జరిగినది.

పిమ్మట 1937 లో ప్రకాశం పంతులుగారి రివిన్యూ మంత్రిత్వపు కాలములో నేను పంతులు గారి వద్ద అంతరంగిక కార్యదర్శిగా వుండుటయు, వెంకటకృష్ణయ్యగారు తరుచు అక్కడికి వచ్చుచుండుటయు ఏర్పడినందున మా ఇరువురకు సన్నిహిత్వము మరింత హెచ్చయినది. ఆ సమయములోనే నా 'గ్రామస్వరాజ్య' గ్రంథము పరిశ్రముల శాఖా మంత్రియైన శ్రీ వి. వి. గిరి ఉపోద్ఘాతముతో ప్రచార మగుటయు జరిగెను.

బెజవాడలో వున్న కాలములోనే 'వెంకట కృష్ణయ్యగారు నన్ను ఒకసారి గుణదలలోని తమ ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళి అక్కడ తమ బిడ్డలకు, ఆశ్రమ వాసుల బిడ్డలకు ఇచ్చుచుండిన శిక్షణ చూపించారు. అందలి తత్వమును వివరించి చెప్పిరి. స్వయముగ ఏకుట, వడుకుట, వడ్లు దంచుట, కూరలు పండించుట, పాఠములు, ప్రార్థనలు చేయుంచుట మొదలైనవన్నియు నాకు ప్రత్యక్షముగ చూపించిరి. నాకు అవన్నియు మనస్సుకు నచ్చునవిగనే యుండెను

1938 లో నేను బందరు కో ఆపరేటివ్ బ్యాంకు ఉద్యోగం వదలి బెజవాడలబ్బీపేటలో "పాల కంపెనీ" అనే పేరుతో గేదెలను పెట్టి పాలూ, పెరుగు అమ్మకం వ్యాపారం సాగింపనారంభించితిని. అదేదో నేను గొప్ప పని-నిజాయితీ అయిన వ్యాపారం (Honest business) చేస్తున్నానని లోలోన గర్వపడుచుంటిని-వెంకట కృష్ణయ్య గారితో అప్పుడప్పుడు చర్చించుచుంటిని. మార్కెట్టు వ్యాపారముగ నేను ఈ పని చేయుట వారికి నచ్చలేదు. ఇది గ్రామతత్వమునకు విరుద్ధమని నాకు బోధించిరి. అమ్ముట, కొనుట అవసరమునకు మించి ఉత్పత్తి చేసి దానిని మార్కెట్టులో అమ్మజూచుట ఇది గ్రామ తత్వమునకు విరుద్ధమని చెప్పిరి. ఈ వ్యాపార పద్ధతి మోసములకు కూడా తావలమని చెప్పిరి.

కొద్ది కాలపు అనుభవములోనే నేను చేయబూనిన పని గ్రామతత్వంరీత్యాతప్పుఅనిగ్రహించితిని- వెంకటకృష్ణయ్య గారి దృష్టి రైట్ అని నాకు నచ్చినది. పిమ్మట తదితర కారణముల చేత కూడ ఆ నా పాలవ్యాపారము విరమింపబడెను.

ఇక బాలురకు శిక్షణ యిచ్చుటలో కూడ వారి మార్గమే నాకు నచ్చినది. బాల బాలికలు 15 సం॥ ల వయస్సు వచ్చే వరకే ఎల్లు స్వార్జిత బిరుదాంకితులు కాగలరో వారు తమ బిడ్డల మీద చేసి చూపించిన రీతియే సవ్యమైన విద్యా విధానమనిన్నీ నేటి యూనివర్శిటీ విద్యావిధానం ఆమూలాగ్రము విషపూరితమైనదానిన్నీ నాకు గోచరించినది. తమ కన్నబిడ్డల నీ రీతిగా నేటి యూనివర్శిటీ విద్యా విధానములో ప్రవేశ పెట్టక తమ ప్రత్యక్ష పర్యవేక్షణ క్రిందనే వారి నందరిని తమ తత్వ సంస్థానమునకు అంకితులుగా చేసి నడిపించిన వెంకటకృష్ణయ్యగారి చర్య చాల సాహసమునూ, వీరోచితమునూ అయిన కార్యమని నా అభిప్రాయము.

అందరి తలిదండ్రులతో పాటు వీరును తమ బిడ్డలను నేటి యూనివర్శిటీ విద్యా యంత్ర

ములో పడవేసి త్రిప్పియునట్లయితే వెంకట కృష్ణయ్యగారును, వారి బిడ్డలునుకూడా ఈపాటికి సర్వవిధములా నలిగి పిప్పియైపోయెడివా రనుట నిస్సంశయము. ఉన్న ఆస్తి పోయేది. మంచి గుణ గణములు నశించేవి. బి. ఏ., యం. ఏ. పట్టాలు పుచ్చుకొని పుట్ట కొకడు, చెట్టుకొకడై నౌకరీల కొరకు హీనముగ బిచ్చమెత్తుటకై అయినవాడి కాళ్ళు, కానివాడి కాళ్ళు పట్టుకొని ఎక్కే గుమ్మం దిగే గుమ్మంగా ఈపాటికి వీరి బిడ్డలు బజారులలో పడవలసి వచ్చేది.

కుటుంబము విచ్ఛిన్నమయ్యేది. వెంకట కృష్ణయ్యగారి నిర్యాణకాలమునకు దగ్గర ఒక్కడుకూడ ఉండేవాడు కాదు. ఇట్టి దుర్ఘటనలు జరుగకుండ మిక్కిలి దూరదృష్టితో వెంకట కృష్ణయ్యగారు తమ బిడ్డలను అంకిత సంతానముగ పెంచి తాము ధన్యులై లోకులకు ధన్యమైన మార్గమును చూపించిరి. వెంకట కృష్ణయ్యగారి జీవితము సర్వవిధముల విజయవంతమైన జీవితము (Successful life ) జీవిత సమరములో నేను ఓడిపోతిని వారు గెలిచిరి.

కాని మన సంఘము నేడు సవ్యమార్గము నుండి చీలి బహుదూరము పోయినది. దీనిని యథాస్థితికి తెచ్చుట సాధ్యమా అనిపించుచున్నది. నా మట్టుకు నాకు నా కుమారుడు ఇట్టి శిక్షణలో పెరగలేదే అనే జిజ్ఞాస తరుచు కలుగుచుండును. కాని తరుణము మించిపోయినది. వెంకటకృష్ణయ్యగారి సంస్థ సహారా ఎడారిలోని ఒక చల్లని నీటి పట్టుగా (Oasis)గ మాత్రమే నేడు నిలచియున్నది.

సర్వము ప్రళయమైనను, సత్యము బీజ రూపమున ప్రళయార్ణవ మధ్యమందు వట పత్రశాయియైన శిశువు గర్భమందు నిక్షిప్తమై యుండి కాలపక్వకాలమందు తిరిగితలయెత్తి లోకమునకు శాంతిని, నీడను ఇవ్వగలదని ఆశింతము- తిరుపతి వేంకటకవులు వక్కాణించినట్లు, "విత్తనాలకున్ జాలినవాగు" ఉంటేచాలును.


Sri Rama Krishna Mike Service

శ్రీ రామకృష్ణ మైక్ సర్వీసు ఫోన్. 1456

ఏలూరురోడ్డు సెంటరు, :: విజయవాడ-2.

అన్నికార్యక్రమములకు మైక్సు, అన్నిపద్ధతుల లైటింగ్ అద్దెకు యివ్వబడును.

ప్రొప్రయిటరు.
కొండిశెట్టి క్రిష్ణ.

# మౌలికమైన ఆలోచన

—రచన : తుర్లపాటి వెంకటకుటుంబరావు.

ఆంధ్రదేశంలో గాంధీజాన్ని గురించి ఆలోచించేవా రందరికి శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారి పేరు వెంటనే జ్ఞాపకం వస్తుంది.

శ్రీ వెంకటకృష్ణయ్యగారు గాంధేయతత్వాన్ని అణువణువునా జీర్ణం చేసుకున్నట్టి వారు. గాంధీజీ లక్షించిన రాజకీయ ఆర్థిక విప్లవాన్ని ఆయన హృద్గతం చేసుకున్నారు. అంతేకాక, ఆయన ఉద్దేశించిన మన ప్రాచీన పంచాయతీ రాజ్యాన్ని గురించి శ్రీ వెంకటకృష్ణయ్యగారు తమకు తోచిన పద్ధతులలో కొన్ని ప్రయోగాలు కూడా చేశారు.

ఒక విధంగా చెప్పాలంటే — గాంధేయ తత్వాన్ని గాంధీజీని మించి ఆయన అవగతం చేసుకున్నారేమోననిపిస్తుంది.

కరెన్సీతో నిమిత్తం లేకుండా వస్తువినిమయ పద్ధతి ప్రాతిపదికగా నడచిన మన ప్రాచీన గ్రామీణ జీవిత విధానం అత్యుత్తమమైనదని ఆయన ప్రగాఢంగా విశ్వసించారు. నేటి అధిక ధరలకు, ద్రవ్యోల్బణానికి ఇప్పటి ఆర్థిక వ్యవస్థలోని చెడుగులకు మూలం కరెన్సీ విధానమేనని ఆయన విశ్వసించి కరెన్సీ వ్యతిరేకోద్యమం ప్రారంభించారు.

ఇది నిజంగా మౌలికమైన, విప్లవాత్మకమైన ఆలోచన. ఈ ఉద్యమాన్ని కొందరు సరిగా అవగాహన చేసుకోలేదు. మరికొందరు అవహేళన చేశారు. అయినా తానునమ్మిన లక్ష్యాన్ని సాధించాలన్న అచంచలమైన పట్టుదల తప్ప అవహేళనలను, అడ్డంకులను ఆయన ఎన్నడూ లెక్క చేసేవారుకారు.

గాంధీజం చరిత్రలో శ్రీ వెంకటకృష్ణయ్యగారి ఖద్దరుసంస్థానం ఒక మైలురాయి వంటిది.

రాజ్యాంగ నిర్మాతఅయిన ఓటరును ఎన్నికల అనంతరం రాజకీయ పక్షాలు, నాయకులు అలక్ష్యం చేస్తున్నారని ఓటరు ఆజ్ఞానుసారమే పరిపాలకులు నడచుకోవాలన్న వుద్దేశ్యంతో ఆయన ప్రారంభించిన ఓటరు సఫేదు ఉద్యమం ఆయన మౌలికమైన ఆలోచనకు మరొక మచ్చుతునక.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఆయనకు అచంచలమైన విశ్వాసం కలదు. ఎలాంటి పదవులను, అధికారాన్ని ఆశించకుండా నిరాడంబరమైన పద్ధతిలో గాంధేయ నిర్మాణ కార్యక్రమాన్ని ఆయన అమలు జరుపుకుంటూ వచ్చారు.

ఆంధ్రకేసరి ప్రకాశంగారితో శ్రీ వెంకటకృష్ణయ్యగారికిగల సంబంధం అతి సన్నిహితమైనది. ప్రకాశంగారిని ఆయన "ఆంధ్రగాంధీ"

గా పరిగణించేవారు. పరిగణించడమే కాదు— పూజించేవారు కూడా.

అయితే, అవసరమైతే ఏదైనా విషయం పైన ఆయన ప్రకాశంగారితో హోరాహోరీగా వాదించేవారు. ప్రకాశంగారికి వెంకటకృష్ణయ్య గారిపట్ల ప్రగాఢమైన విశ్వాసం వుండేది. గాంధేయ సిద్ధాంతానికి గాంధీజీ సిద్ధాంత కర్త కాగా, డాక్టర్ పట్టాభి భాష్యకారుడు. అలాగే ప్రకాశంగారు ప్రవచించిన గ్రామస్వరాజ్య సిద్ధాంతానికి శ్రీ వెంకటకృష్ణయ్య గారు భాష్యకారుడని చెప్పాలి.

1946లో ప్రకాశంగారు మద్రాసు ముఖ్యమంత్రిగా వుండగా, ఆయన తల పెట్టిన గ్రామీణ ఆర్థిక, స్వరాజ్య పథకాలన్నింటిపైన శ్రీ వెంకటకృష్ణయ్యగారి ప్రభావం కలదు.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు పరచడానికి తాను రూపొందించిన ప్రతి పథకాన్ని శ్రీ వెంకటకృష్ణయ్యగారితో ఆలోచించి గాని ప్రకాశంగారు తుది మెరుగులు దిద్దేవారు కారు.

తాను నమ్మిన సిద్ధాంతాలను తనతో సమానంగా విశ్వసించి, వాటి అమలుకు పాటు బడే కుటుంబం లభించడం అదృష్టమనుకుంటే, ఆ అదృష్టం గొప్పగా లభించిన వారిలో శ్రీ వెంకటకృష్ణయ్యగారు ఒకరు. శ్రీ వెంకట కృష్ణయ్యగారి కుమారులు, ఆయన సోదరుడు శ్రీ రామశాస్త్రిగారి కుమారులుకూడానిర్మాణ కార్యక్రమం పట్ల అచంచలమైన విశ్వాసం కల వారు. శ్రీ వెంకటకృష్ణయ్యగారి జీవితకాలంలో వీరందరు ఆయన కార్యక్రమాలలో పూర్తిగ సహకరించి, ఆయనకు చేదోడు వాదోడుగా వుండేవారు. ఆ కుటుంబం, వారి మర్యాద మన్ననలు, విశిష్టమైన వారి కట్టుబాట్లు, ఆ గ్రామ స్వరాజ్య ప్రెస్సు, దానిఆవరణ, అక్కడ జరిగే కార్యక్రమాలు— అది ఒక ఉద్యమం, ఒక సంస్థ. అంతేగాని, కేవలం ఒక వ్యక్తి నివాస స్థానం కాదు.

శ్రీ వెంకటకృష్ణయ్యగారి మృతి ఆంధ్ర దేశంలో గాంధేయ తత్త్వ విచారానికి తీరని లోటు.

ఆయన లేకపోయినా, ఆయన కుటుంబ సభ్యులు ఆయన కార్యక్రమాన్ని కొనసాగించ గల రనడంలో సందేహం లేదు.



"ఎంతటి మేధావంతుడయినను, ఎంతటివలుకుబడి సంపాదించినవాడైనను, ఎంతటి రాజ్యాధికారులైనను నీకు ధనసంపాదన ( law of Possession ) కు తోడ్పడగలడేమోగాని మాయను దాటుటకు దారిచూపింప జాలడు. కాన నియమబద్ధుడవై ఆచరణతో కూడిన విజ్ఞానము నభ్యసింపుము. నీకు ఆధారము లభించగలదు."

— ఆచార్య వెంకటకృష్ణయ్య.

## కీ॥ శే॥ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు.

— డా॥ వెంపటి సూర్యనారాయణ.

శ్రీ ఉప్పులూరి వెంకట కృష్ణయ్యగారితో నాకు చాల సంవత్సరముల నుండి దగ్గర పరిచయము కలదు. పెద్ద పెద్ద సిద్ధాంతములు చెప్పు వారిని చాల మందిని మనము చూచుచుందుము. కానీ వాటిలో కొన్నింటినైననూ అమలులో పెట్టి జీవితమును సార్థక మొనరించుకొను వారిని వ్రేళ్ళపై లెక్క పెట్టవచ్చును. శ్రీ వెంకట కృష్ణయ్యగారు ఈ పుణ్య శ్రేణికి చెందినవారిలో ఒకరు.

శ్రీ వెంకటకృష్ణయ్యగారి పేరు స్మరించినంతనే (1) నమ్మిన సిద్ధాంతములందు గట్టి పట్టుదల, కార్యదక్షత (2) అపరిగ్రహ వ్రతపాలనలో తనకేగాక తన బిడ్డల కందరకూ శిక్షణ నిచ్చి పాశ్చాత్య విద్యాలయములలో వారిని ప్రవేశపెట్టక గృహ పరిశ్రమలలో తర్ఫీదు నిచ్చి తమ కాళ్ళపై తాము నిలుచుండునట్లు తయారు చేయుట (3) వస్తుమార్పిడి విధానములో నిష్ఠతో పరిశోధనలు చేసి ప్రయోగములు చేయుట (4) కొరన్సీ పద్ధతి మన అర్థిక వ్యవస్థను అస్తవ్యస్తము చేసినదని గమనించి వస్తుమార్పిడి పద్ధతిలో గ్రామముల ఆర్థిక వ్యవస్థను చక్కచేయబూనుట మొదలైన వెన్నో నా దృష్టి పథమున గోచరించును.

ఒక సిద్ధాంతమును ప్రచారము చేయు వ్యక్తికి నిజమైన గీటురాయి, మోక్షప్రాప్తి తన సిద్ధాంతమును అమలు జరుపగల అనుచరుడు లభించుట యని పెద్దలు చెప్పుదురు. ఈ దృష్ట్యా వెంకట కృష్ణయ్యగారు ధన్యుడనీ, ఆదర్శ గురువనీ స్పష్టముగా చెప్పవచ్చును. అందుకు నిదర్శనముగా సహృదయుడు, బుద్ధిశాలి, నిష్ఠాపరుడు అయిన శ్రీ ఉప్పులూరి రామశాస్త్రిగారను అనుచరుడు వీరికి లభించి గురువును మించు నిష్ఠతో సాధన చేయుచున్నారు. వీరి ద్వారా, వీరి బిడ్డల ద్వారా, శ్రీ వెంకట కృష్ణయ్యగారి బిడ్డల ద్వారా కీర్తిశేషులు స్థాపించిన ఖద్దరు సంస్థానము దిన దినాభివృద్ధి చెంది వెంకట కృష్ణయ్యగారి ఆత్మకు శాంతిని చేకూర్పగలదని ఆశించుచున్నాను.

---

"అర్హత కలిగి వుండుము. అర్హుడవని అనిపించుకొనుము. యితరులకు నీయందు జాలిపుట్టునట్లు నటించవద్దు. అర్హత పొందగలిగితే సమస్తము నీవు పొందగలవు. అది నీకు ధైర్యమునిచ్చును."

ఆచార్య వెంకటకృష్ణయ్య.

## ధీశాలి - వెంకటకృష్ణయ్యగారు

రచన : గోరా.

"ఎవరు మీరు" అని అడిగాను పత్రికవారిని యిరవై సంవత్సరాల క్రిందట. విజయవాడ రామమోహన లైబ్రరీలో నా 'నాస్తికత్వం' ఉపన్యాసం, ప్రశ్నోత్తరాల సమయంలో నా చేతిలో ఒక చీటీ పెట్టారు. "మీ వంటి నాస్తికులకు, నా వంటి ఆస్తికునికి చర్చ జరగాలి; మీరు అంగీకరిస్తే, నా ఖర్చులతో సభ ఏర్పరుస్తాను."

ఇట్లు,

ఉప్పులూరి వెంకటకృష్ణయ్య.

సభానంతరం కృష్ణయ్యగారిని కలిశాను. మరునాడు వారి ఇంటికి వెళ్ళాను. వారి స్పష్టమయిన భావాలు, నిర్మొగమాటమయిన మాటలు, నన్ను ఆకర్షించాయి. వారు ఎంత ధైర్యవంతులో, అంత ఉదార స్వభావులు. అభిప్రాయ భేదాన్ని ఆయన గౌరవించగలరు.

తాను అనుకున్న రీతిగా తన జీవితాన్ని, తమ కుటుంబ జీవితాన్ని రూపొందించారు. ఖద్దరు సంస్థానం, గ్రామస్వరాజ్య ప్రెస్సు ఇందుకు నిదర్శనం. నిర్జీవంగా చట్టంలో మూతబడియున్న గ్రామరాజ్య సూత్రానికి ప్రాణంపోసి ప్రచారంతో పైకిలాగిన ధీశాలి ఈ వెంకటకృష్ణయ్యగారు.

ఆయన జబ్బుపడినా, మాటధాటీ తగ్గలేదు. అతిథిసత్కారం లోపించలేదు. కార్యకర్తల సుఖ దుఃఖాలలో భాగస్వామి అవుతూ నాయక శ్రేణికి మార్గదర్శిగా నిలిచిపోయారు.



"శిక్షణతో కూడిన జ్ఞానము పొందుము. శిక్షణలేని జ్ఞానము వ్యర్థము. శిక్షణగలజ్ఞానము చెప్పలేనంత మేలును యిచ్చును. బుద్ధిలోగల బీదరికము తొలగింపుము. బుద్ధిబీదరికముగలవారలయందు సానుభూతిగలిగి బుద్ధిస్థితివంతత్వము పెంపొందించవలెను."

—ఆచార్య వెంకట కృష్ణయ్య.



డా॥ ఎన్. వి. కామేశ్వరరావు

పంచాయితీలను పటిష్టంగా ఏర్పరచి, పంచాయితీలద్వారా సులువుపాలనజరపాలనేదానికై తనజీవితం అంకితంచేసిన- ఖద్దరుసంస్థాన నిర్మాత - మహావ్యక్తి

# శ్రీ వెంకటకృష్ణయ్యగారు

భారతరాజ్యాంగం 40 వ ఆర్టికలు వర్ధిల్లాలని ఇటు ప్రజలకు— అటు న్యాయస్థానములకు ఓటరు సఫేదు పత్రములద్వారా తెలియజేశారు. చివరకు భారత ప్రభుత్వంకూడా గత్యంతరంలేక 40 వ ఆర్టికలును అమలు జరుపుతున్నది. నాకు— వారికి గల 20 సంవత్సరాల పరిచయంలో వారి పంథానుగురించి ఆలోచిస్తే దేశానికి ఎంతో మార్గదర్శకంగా వుండగలదని నాకు విశ్వాసం కలిగింది (గ్రామాభివృద్ధే 'దేశాభివృద్ధి' అనిచెప్పే వారి పంథాను మహాత్మాగాంధీ, బాబూరాజేంద్ర ప్రసాద్, ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు, ఆచార్య వినోబాభావే, జే. సి. కుమారప్ప మొదలగు వారుకూడా ఆశీర్వదించారు. దేశంలోని దారిద్ర్య నిర్మూలనకు శ్రీ ఉప్పులూరివారి కృషి ఎంతైనా అవసరంగా ఉపయోగపడగలదని చెప్పారు.

ఇంగ్లీషువారి కాలంలో తిండితిని పనిచేసే వాళ్ళు. కానిస్వరాజ్యంలో పనిచేసి తిండితినాలని ఉప్పులూరివారి కోరికైవుంది. అంటే ఆస్తి మీద హక్కు— ప్రాణంమీద ఆశ— వదులుకోవాలనీ, అప్పుడే నిజమైన స్వరాజ్యమని నేను అభిప్రాయపడుతూ వుండేవాణ్ణి. నా సందేహాన్ని శ్రీ ఉప్పులూరివారివలన తీర్చుకోగలిగాను. ఇలాంటివ్యక్తి నూటికేకాదు— కోటికి ఒక్కడున్నా ఈదేశం యీనాటి విధానాలతో వుండేదేకాదని నేను వేరే చెప్పనక్కరలేదు.

స్వయంపోష్యవిధానం అమలుజరిగినప్పుడే దేశంలో శాంతిసుస్థిరమని, సులువుపాలనా విధానంపై భద్రతలు ఆధారపడివుంటాయని శ్రీవారి పంథా.

యీ విషయాలు మనపెద్దలు చాల బాగున్నాయని చెప్పడం, వినడం జరుగుతోందిగాని, ఎందువల్లనో అమలు జరుపలేక పోతున్నారు. మన ప్రణాళికలు ఎందువల్ల విజయాన్ని సాధించుకోలేక పోతున్నాయి? దానికి కారణం ఉప్పులూరివారి ఓటరుసఫేదు పత్రాలు చదివితే

బోధపడుతుంది. ఇప్పటి ప్రభుత్వం ప్రజలకు ఏ విధంగాను ఉపయోగ పడేదిగా లేదు. కేవలం ప్రభుత్వోద్యోగుల - రక్షణకొరకు, జీవితభీమాలు దెబ్బతినకుండా వుండేందుకు ఈ ప్రభుత్వం బాధ్యత తీసుకున్నదని నేను వారి ఓటగు సఫేదుపత్రిములలో చదివాను. వారు వ్రాసినవన్నీ నిజమనిపిస్తున్నాయి. ఓటు పేరున పదవులు స్వీకరించారని ప్రజలనుకోవడంలో తప్పేముంది? రాజకీయవాదులు నాయకులుగా ఎన్నిక కాబోయే ముందు రక్తపరీక్ష చేయించుకుని, 60 వయస్సుకు మించకుండా శిక్ష వయస్సు కల్గివున్న వారే దేశానికిగాని, ప్రజలకు గాని ఉపయోగ పడగలరని అప్పుడప్పుడు వారి ఉపన్యాసములలో అంటూ వుండేవారు. ఈ ప్రభుత్వం యిప్పుడున్న రీతులలో సాగినట్లయితే తారుమారు తప్పదని నా దృఢ నిశ్చయం. ఎవరి తరఫున, ఎవరి శిఅజ్ఞ రసా వహించి తాము పదవీ స్వీకారం చేశారో అట్టి వారిని దుయ్యబట్టడం ప్రభుత్వ లక్ష్యమే అయితే ఏ ప్రభుత్వమైనా ఎంతో కాలం నిలువదని గట్టిగా శ్రీవారి వాక్యాలలో తరుచుగా వినబడుతుండేది. కాబట్టి ప్రజలు, ప్రభుత్వం శ్రీవారి లక్ష్యాలను సేకరించి అమలు జరిపే కృషికి దోహదమివ్వాలి.


మా ఖాతాదారులకు,
శ్రేయోభిలాషులకు,
మిత్రులకు మా నూతన సంవత్సరాభివందనములు!

నవభారత్ అగ్రికల్చరల్
అండ్
కమర్షియల్ కార్పొరేషన్

రష్యన్, డీజిల్ ట్రాక్టర్లకు ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు

Phone: 1199 P. B. No. 365 Grams: "AGRICULT"

VIJAYAWADA-2

బ్రాంచి: సుబేదారుపేట - నెల్లూరు.

# వి శి ష్ట వ్య క్తి

రచన :
తుమ్మల బసవయ్య.

విశిష్టమైన వ్యక్తిత్వము కలిగి, నీతినిజాయితీ కలిగి, నిస్వార్థ, నిర్విరామ సేవాదీక్షగలిగి, ఆదర్శధర్మకర్తృత్వ భావముకలిగి, స్వయంసమృద్ధి కలిగి, స్వయంసమృద్ధి - స్వావలంబన సాధనలతో నిరంతరసాధన సలిపి - ప్రజాహితసంస్థలను వినూత్నపథమున సంచాలనమొనర్చు తీరును ప్రబోధించి - విలువ నాణెమునకుగాక వస్తువునకు యివ్వవలెనని ప్రబోధమొనర్చి ఆయా యీ నిరంతర సాధనలద్వారా - విలువ భౌతిక దేహమునకుకాదు - అందు నిహితమైయున్న "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను గీతావాక్యప్రకారము - ఆత్మకు ప్రాధాన్యమిచ్చి ఆదర్శవంతులు, స్వయంపోషకులుగా మానవాళిని తీర్చిదిద్దు కార్యక్రమములో అవిరళకృషి - సల్పిన - ఆచార్య ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారి జీవితము ధన్యము.

సామాన్యజీవిగా జీవితమును ప్రారంభించి - సంస్థనొకదానిని స్థాపించి ఆ ఖద్దరుసంస్థానము ద్వారా అనాదికాలమునుండి భరతఖండమున గ్రామసీమలో ప్రచారమందున్న వస్తువినిమయ వస్తుమార్పిడి సిద్ధాంతమును అవగతమొనర్చుకొని — అనుష్ఠించి తమ దివ్యఫలములను సోదర ప్రజానీకమున పంచవలెనను మహత్కాంక్షతో వారు సలిపిన పరిశోధన మహత్తరమైనది. వారి పరిశోధనలను భారతజనకుడు మహాత్మాజీ మనసారాశీర్వదించినారు. మహాత్ముని మన్ననల నందిన వారి దివ్యకృషి - మహిమాన్వితమైనది.

సంస్థలోనేమి- సంచాలనములోనేమి - మన సత్వములనుబట్టి మానవాళి వర్గీకరణలోనేమి చిన్నకదురు - పెద్దకదురు (రోకలి), చిన్నరాట్నము — పెద్ద రాట్నము (నాగలి) మొదలగు సకల పరిశ్రమల ఉచ్చ — నీచములను భేదము పాటించక - అనుష్ఠించుటలోనేమి, విధానములోనేమి, గ్రామస్వరాజ్యము — గ్రామ పాలన రీతులలోనేమి, వారిదొక వినూత్న పథము. ఆంధ్రకేసరి గ్రామాభ్యుదయ ప్రణాళికేమి, అవి యన్నియు ఆ చా ర్య వెంకటకృష్ణయ్యగారి దివ్యానుభవముల చేత ప్రేరితమయినవేకదా!

ఆచార్య వెంకటకృష్ణయ్యగారి 60వ జన్మదినమున ఆశ్రమానికి వారిని ఆహ్వానించాము. పూజ్య స్వామిసీతారాంగారి సమక్షములో ఆ కర్మయోగి - నిష్కామసేవకుని 60 వసంతముల పండుగ - వినయాశ్రమం జరిపే భాగ్యము - ఆ దివ్యదృశ్యములను గాంచు భాగ్యము మాకు సదా అత్యంతానందదాయకము. ఆనాడు వారు "నిరంతర సాధనచేయుట- స్వావలంబిగా జీవించుట నేను కోరుచున్నాను. పరావలంబిగా జీవించుటకంటే - నేను మరణమును కోరుకుంటాను. మరణించునపుడు కుక్కమంచము మరణముకంటె వీరమరణమును నేను కోరుకుంటాను" అని

చెప్పిన మాటలు ప్రతిక్షణమూ చెవులలో గింగిరు మంటూవుంటాయి.

ఆంధ్రానందయాత్రలో, గాంధీసేవాసంఘ సభ్యుల యాత్రలో, ఆంధ్రరాష్ట్రసాధనలో - మద్యనిషేధోద్యమములో - అస్పృశ్యతా నివారణలో - పంచాయితీ పాలక కార్యక్రమములో వారితో కలసి–మెలసి గడిపిన ఘడియలు, అనుభవములు దివ్యములు. అవి మధురానుభూతులు.

వారు స్థాపించిన ఖద్దరుసంస్థానము వారి సాధనలకు ఆలవాలమై అలరారుచున్నది. దాని సంచాలనమునకై వారు గావించిన యేర్పాట్లును అపూర్వమైనవి. జీవితవినిమయమున వారి పరిశోధనలు సదా మార్గదర్శకములయి వరలగలవు. వారి ఆదర్శములు - వారు స్థాపించిన సంస్థద్వారా వారు, "అమరులై" యుందురు గాక!



"పాండిత్యమును యిచ్చునది విద్య. దానిని ప్రకటించుటకు తోడ్పడునది భాష. కాన విద్యయున్నూ, భాషయున్నూ ఒకటి కావు. వేరువేరు అయియున్నవి. పాండిత్యమును ప్రకటించుటకు తోడ్పడుట వలన భాషకు అన్ని కళలకంటె హెచ్చుగౌరవము వచ్చినది. రసాయనశాస్త్ర పరిశోధనకు తోడ్పడునది భాష. గుణత్రయ సంఘర్షణను గుర్తించునది పాండిత్యము . కాన విద్యాప్రావీణ్యత సంపాదించగానే పాండిత్యము కలిగినదని పొరపాటుపడరాదు. Law of Non - possession క్రిందకు రాజాలనివాడు విద్యావంతుడు కాజాలడు. అతడికి పాండిత్యము వుండదు. అతడు గుణత్రయ ప్రాబల్యమును గుర్తించజాలడు. యిందుగల తారతమ్యములు తెలుసుకో జాలనివారు తాము ఆత్మవంచకులు అగుటయే గాక ప్రజలకు విపరీతమగు అన్యాయం చేసినవారగుదురు"

—ఆచార్య వెంకట కృష్ణయ్య.

# ఆచార్యుని దీక్షాకృతి

శిక్షణనిలయ విద్యార్థి"

**19 0** వ సంవత్సరంలో గాంధీమహాత్ముడు స్వరాజ్యసిద్ధికై అహింసాయుత సంగ్రామమారంభించినపుడు "బ్రిటిష్ సామ్రాజ్యమంటే రవి అస్తమించని సామ్రాజ్యం. మంత్రాలకి చింతకాయలు రాల్తాయా!" అని అపహసించినవా రుండకపోలేదు. సత్యాహింసలయందు నమ్మిక వున్న కొంతమంది మహనీయులు ఆయనను ప్రశంశించకుండానూ లేరు. ఖద్దరుసంస్థాన ధర్మకర్త ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు మహాత్ముని ఆశయములయందు నమ్మిక యుంచినవారు. వారిని ప్రశంశించుటే తమ కర్తవ్యంగా భావించి వూరకుండ లేదు. మహోన్నత విలువలు కలిగిన అహింసాయుత విధానంద్వారానే భారతదాస్యవిముక్తి జరగాలని ఆకాంక్షించిస్వరాజ్యసముపార్జన తథ్యం అని నమ్మినవారు.

అంత మన భారతీయసంస్కృతికి అనుగుణంగాను, అహింసాయుత విధానానికి ప్రతీకగాను మనం యెట్టి వ్యవస్థను చేపట్టాలి? యే వ్యవస్థ నేర్పరుచుకుంటే ప్రజాస్వామ్యంలోని ప్రతిపౌరుడు దేశసంపదను అనుభవింపగలిగి ఉత్తమ పౌరుడుగా మనగలుగుతాడు? అనే ఆలోచనలు రాగా తమ ప్రజ్ఞావిశేషములు స్వార్థమునకై గాక, సమాజశ్రేయస్సుకుపకరించేవిగా రూపొందినవి. ఉత్తమపరిపాలనా విధానాన్ని అన్వేషించుటకై దృష్టిని మరల్చినారు. తమ యావత్తు స్వార్జితాన్ని (Law of Non-possession) కు వర్తించేలాగు ట్రిష్టుచేసి ధర్మకర్త కాగలిగిరి. ప్రజాస్వామ్యంలో లక్షలు గడించిపెట్టాలనే ఆశ ఫలించదని, దానివలన భ్రమ ప్రమాదాలకు లోనై నివ్వీరపోయేకాలం వస్తుందని గుర్తించిరి. ఆస్తిహక్కులను విడుదల చేసుకుంటూ తమ వారసులకు తగిన శిక్షణ యివ్వడమే ప్రజాస్వామ్యంలో ప్రతివాని కర్తవ్యంగా వుండాలని పక్కాణించిరి. ఈ సంబంధమయిన పరిశోధన ప్రధానము కాగా, గాంధీజీ మొదలగు మహానాయకుల నాకర్షించగలిగారు. స్వరాజ్య ప్రాప్తికై గాంధిమహాత్ముడు కృషిసలుపుచుండ రానున్న స్వరాజ్యంలో ఉత్తమ ప్రజాస్వామ్య విధానాన్ని నిర్మింపబూనిన వెంకటకృష్ణయ్యగారు ఖద్దరుసంస్థాన శిక్షణనిలయంద్వారా ఆచరణతో కూడిన పరిశోధనను ప్రారంభించారు.

ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే ప్రతిపౌరుడికీ ఓటుహక్కు యిచ్చినంతమాత్రమున ప్రయోజనముండదనియు, దానితోపాటు చింతనశక్తులను గమనించి వాటిని సమన్వయము చేసినపుడే ప్రజాస్వామ్యం వర్ధిల్లగలదనియు తమ పరిశోధనలో తెలుసుకొనిరి. చింతనశక్తులనుబట్టి మానవకోటిలో మూడురకాలవా రున్నారని తెలిపిరి. మనోచింతన, వాక్చింతన, క్రియాచింతనలలో యేదో ఒకశక్తి మానవునకు పుట్టుకతోనే సంక్రమిస్తున్నది.

పైమూడు చింతనలలో మనోచింతన అనేది అతిఉపయుక్తమయినది, దారి తప్పితే అతి ప్రమాదకరమయినదికూడా అవుతుంది. ఈ శక్తి ఆలోచనకు సంబంధించి వుంటుంది. ఇట్టి శక్తి గలవారు 100 కి 5 గురు మాత్రమే (అంటే అతి స్వల్పసంఖ్యలో) వుంటారనేది సత్యము. తతిమా 95 మంది పుట్టుకతో క్రియాచింతనకో, వాక్చింతనకో చెందివుంటారు. యిట్టివారికి స్వయంప్రకాశానికి అవకాశాలుండవు. ఆధారము లేకుండా వీరు రాణించలేరు.

మనోచింతన గలవారికి స్వయంప్రకాశానికి అవకాశా లుంటవి. స్వార్థానికి మూర్తీభవించి వుంటారు. అయితే యిట్టి వారికి వాక్చింతన, క్రియాచింతన గలవారలు తమ ప్రక్క లేకుంటే అప్రయోజకులుగానే నిలిచిపోతారు. వాక్చింతన, క్రియాచింతనగలవారల కూడలి కొరకు

ప్రయత్నాలు చేస్తారు. మనోచింతనగలవారి ఆసరాలేకుండా పై రెండు రకములవారు నిలదొక్కుకోలేరు గనుక వారి ప్రక్కకు వస్తూంటారు. ఇది ప్రకృతినైజం.అంత స్వార్థదృష్టిగల మనోచింతనగలవారు పంట తమకు వుంచుకొని గడ్డి యితర్లకు వదిలేస్తుంటారు. ఈ విధంగా దేశసంపదను హస్తగతం చేసుకుంటారు. అధికార ప్రాబల్యానికై పెనుగులాడుతుంటారు. వీరి మధ్యన 100కి 95 మందిగల వాక్ చింతన,క్రియా చింతన గలవారలు కునలిగిపోతూవుంటారు. రాజరికంలో ఈస్థితి కలుగకుండా రాజు బాధ్యత వహించాడు. పని [illegible], వృత్తుల నేర్పరచి, ధర్మం చెడకుండా దేశసంపదను ప్రతివాడికీ అందించేభారం రాజుదై వుండేది.

యిప్పుడు రాజరికం నశించిపోయింది. ప్రజాస్వామ్యం యేర్పడింది. ప్రతివ్యక్తికీ ఓటు హక్కు కలుగజేస్తే బాధ్యతతీరిపోదు. పై చింతన శక్తులను సమన్వయపరిచే శిక్షణ ముందు ప్రధానం. ఓటు హక్కుకు ముందు చింతన శక్తులను సమన్వయ పరిచే శిక్షణ లేకపోతే మనోచింతన గలవారు దేశసంపదను ఖండించుకుంటారు.దాంతో అసమానత్వం ప్రజ్వరిల్లుతుంది. 95% జనాభా గల తతిమావారు తిరుగుబాటు చేస్తారు.ఈరెండు విధానాలుమనఅహింసాయుత సూత్రాలకీ, భారతీయ సంస్కృతికీ విరుద్ధములైనవే. అంతేకాదు, లభించిన స్వరాజ్యానికీ మరల గొడ్డలిపెట్టు కాగలదు. మన స్వరాజ్యం నిలవాలన్నా,మనప్రజలుశాంతికాముకులై ఆదర్శంగా ప్రపంచానికి కనబడాలన్నా చింతన శక్తుల సమన్వయ శిక్షణ అతిప్రధానం అని భావించి ఖద్దరుసంస్థానాన్ని 18-4-1927 లో స్థాపించి కృషిసాగించిరి.

7 వ సంవత్సరం నుంచి 20 వ సం॥ర వరకు మొదటి 14 సం॥ శిక్షణ కాలంగాను, 20 వ సం॥ నుండి 35 వరకు రెండవ 14 సం॥ రముల శిక్షణకాలంగాను గుర్తింపుచేయించిరి. మొదటి 14 సం॥ కాలము కృతయుగకాలంతో పోల్చబడినది. ఇందు బాలుని మనస్సు కృతయుగ ధర్మములతో పోలివుంటుందని, అనుకరింప చూస్తూ వుంటుందని, నిర్మాణాత్మకంగా బుద్ధిని పెంపుచేయుటకు అన్నివిధాల అనువుగావుంటుందని శాస్త్రరీత్యా తెలుస్తోంది.

ఈ కాలంలో బాలునికి వారసత్వంచూపు కలిగించకుండా ఉత్పత్తి ప్రధానమైన స్వార్జిత చూపును కలిగించి వయస్సువారీ శిక్షణ యివ్వాలని చెప్పబడినది ఈ శిక్షణలో అన్ని రకముల పనులు, వృత్తులు, విద్య మిళితమై వుంటవి. దీనికే 'గ్రామస్వరాజ్య శిక్షణ'అని పేరీయ బడినది యే ఒక్కచింతన శక్తిగల వానికైనా ఈ శిక్షణ సులభ సాధ్యమైనదని ఆచరణలో ఋజువయినది. ప్రజాస్వామ్యంలో వారసత్వ చూపుగాని,నౌకరీ శిక్షణ(College education ) గాని యిప్పించుట కృతయుగ ధర్మాలకి పూర్తి విరుద్ధమని, అతిదూష్యమయినదని ఖద్దరుసంస్థానం ఖండితముగా చెప్పివేసినది.

ఇక రెండవ 14 సం॥రముల కాలం త్రేతాయుగంతో పోల్చబడినది. యిందు వయఃప్రభావాన్నిబట్టి స్వల్పఒడుదుడుకులు సంభవించినా కృతయుగశిక్షణ అనుభవాన్ని జ్ఞప్తికి తెస్తూ ఒడుదుడుకులను సవరించుకోవచ్చని ఋజువయినది. మొదటి 14సం॥శిక్షణ కాలములో స్వయంగాను, రెండవ 14 సం॥ శిక్షణకాలములో దంపతయుక్తంగాను సంపాయించుకున్న స్వార్జితాన్ని తమ సంతతివారికి వారసత్వంగా ఇవ్వనక్కరలేదు అనే ధైర్యాన్ని తెచ్చుకొనుటతో రెండు పద్నాలుగు సంవత్సరముల శిక్షణ పూర్తి అయినట్లుగా గుర్తింపబడుతుంది. ఈ రకమయిన శిక్షణలో అధికంగా సంపాయించుటకుగాని, వారసత్వంచూపు కలుగజేసేందుకుగాని అవకాశాలే వుండవు' ఒకరిని ఒకరు వంచించటంగాని, అత్యాశతో అవినీతికి దిగటంగాని ఈవ్యవస్థలో వుండదు. చింతనశక్తుల సమన్వయ శిక్షణ ఈ

విధంగా ముగుస్తుంది. ప్రతి మనిషీ ఈ విధంగా తన 35 సంవత్సరం నాటికి స్థిరత్వాన్ని పొంద గలుగుతాడు.

పై రెండు 14 సం॥రముల శిక్షణ కాలంలో సంపాయించుకున్న స్వార్జితనిధి యెవరిది వారికే వప్ప చెప్పబడుతుంది. 35 సం॥రము నుండి ద్వాపర యుగ ప్రభావం మనిషిమీదపనిచేస్తూ వుంటుందని తెలుసుకోబడింది. ఇది అతిప్రమాదకరమయిన కాలము. ఈ ద్వాపరయుగ వ్యామోహంలో చిక్కుకున్న ప్రతివానికీ తనతోటి వానికంటె అధికుడుగా వుండాలనేకాంక్ష వెన్నంటి వేధిస్తూ వుంటుందని ధర్మకర్తగారి వ్రాతల సారాంశమై వున్నది. రెండు 14 సం॥రముల శిక్షణ వుంటేగాని పై వ్యామోహము నుండి తప్పుకోజాలడని సుస్పష్టం చేసిరి. ప్రతి స్వార్జితుడు తన 35వ సం॥రమునసే Non possession of property దీక్ష తీసుకొని ఈషణలకు లొంగకుండాను, ఈ వ్యామోహానికి చిక్కకుండాను జాగ్రత వహించాలనిబోధించిరి. Non-possession of property దీక్ష ఒక్కనాటితో పూర్తి అయ్యేదికాదు. దీనిని 25సం॥రములు సాధక చేసి ఋజువుచేసుకోవలసి వుంటుందని తెలియజేసిరి సాధకమీద నూటికి యే అయిదుగురికో యిది అబ్బుతుందని వారే Faith in nonpossession గలవారని తెలిపిరి.

మిగిలిన వారినిమతంపేరటా, ధర్మంపేరటా. శాసనముల ద్వారా Law of nonpossession కు కట్టడిచేసి ద్వాపరయుగ వ్యామోహములనుండి తప్పించుట అహింససేవా సంఘ సభ్యులయొక్క కర్తవ్యమని నుడివిరి.

ప్రతి కులంలోను నాలుగు వర్ణాలవారుంటారని అహింససేవాసంఘ సభ్యులన్నా, లేక వర్ణ బ్రాహ్మణులన్నా Faith in nonpossession స్థితికి వచ్చినవారేనని చెప్పిరి. ఏ కులానికి చెందినా వర్ణ బ్రాహ్మణులైన అహింస సేవాసంఘ సభ్యుల ద్వారా భారతదేశ పరిపాలన సాగాలని అప్పుడే వికేంద్రీకరణ విధానం క్రింద ప్రజాస్వామ్యం శాంతియుతంగా వర్ధిల్ల గలుగుతుందని చెప్పి తమపరిశోధనను ముగించిరి.

1935 నవంబరు 14 వ తేదీన బాబూరాజేంద్రప్రసాదుగారు ఆహ్వానింపబడిరి. ఆ సందర్భములో "అంకితబాలబాలికల రాజేంద్రపట్టిక" అను పేరుతో అప్పుడు వున్న ఐదుగురు విద్యార్థులను ఈ విధానానికి అంకితమొనర్చిరి. "యే బచ్చే దేశ్ సేవా కేలియే అర్పిత్ కియేగయే హైఁ." అని ప్రసాద్ గారు వ్రాతమూలక సందేశమునిచ్చి ప్రశంశించియుండిరి. యిప్పుడు ఆ రాజేంద్రపట్టిక 42 ... విరాజిల్లుచున్నది. ఆంధ్రకేసరి దీనికి ... ముకై నిలిచిరి. భారత రాజ్యాంగచట్టములో 40 వ ఆర్టికలు ప్రవేశ పెట్టించి ఈ విధానానికి బలము చేకూర్చిరి. తమ విధానాన్ని ఖద్దరుసంస్థాన శిక్షణనిలయంలో ప్రత్యక్షంగా ఆచరణయందు చూపుచూ యావద్భారతదేశములో దీన్ని అమలుజరిపించవలసినదని గాంధీమహాత్ముని కోరిరి. ఈవిధానం అమలు జరుపుకోకపోతే భౌగోళికంగా భారతదేశం ఎంతవిశాలమైనదయినా ఆంతరంగికంగా మనోచింతన గలవారిచే ఖండ ఖండములుగా విభజించబడి తమపేర్లతో వుంచుకోబడుతుందని, అసమానత్వానికిహేతువగుతుందని ,ఆంతరంగిక కల్లోలం యేర్పడి భారత సంస్కృతికి లోగడ విదేశీయులవలన ప్రమాదం యేర్పడితే యిప్పుడుచేతులారా హానిచేసుకున్నవారమై సంపాయించుకున్నస్వరాజ్యమునకే ముప్పు తెచ్చుకొన్నవారమవుతామని తెలియజేసిరి.

ఈ విధానాన్ని దేశవ్యాప్తంచేసేందుకు పూనుకుంటానని గాంధిమహాత్ముడు మాట యిచ్చిరి. మనలక్ష్యం ఒకటేనని, ఎన్ని అవాంతరాలు వచ్చినా ఖద్దరుసంస్థానాన్ని నిలిపివుంచమని వ్రాసిరి. తరువాత ఆరు నెలలకు ప్రస్తుతం దీన్ని దేశవ్యాప్తంచేసేందుకు వీలుపడకున్నదని తెలియజేసిరి. స్వరాజ్య సముపార్జనకై రాజకీయాధికారపద్ధతులను స్వీకరించివున్న ప్రజలలో ముందుగా ఈ పద్ధతులను ప్రవేశపెడితే వారు

## ఖద్దరుసంస్థానాధీశుడు - ఉప్పులూరి వెంకటకృష్ణయ్య.

—అయ్యంకి వెంకటరమణయ్య, సరస్వతీ సామ్రాజ్యాధ్యక్షుడు.

సంపూర్ణ మానవత్వమును స్థాపించుటకై U. వెంకటకృష్ణయ్యయోగిపుంగవుడావిర్భవించినాడు. సామాన్యమగు ప్లీడరీ గుమాస్తాగా జీవితమును ప్రారంభించినఆయన అందులోవున్న హైన్యతను గుర్తించినవాడై అచిరకాలములోనే ఆవృత్తిని త్యజించి "ఖద్దరు సంస్థానము" ను స్థాపించి సహజీవన సిద్ధాంతమును అవగతము జేసికొని దానిని ఆచరణలో పెట్టి సర్వోదయమును అవతరింపజేయుటకై ప్రకృతి రామణీయకమైన, ఆనందమయమయిన ప్రదేశమున ఋష్యాశ్రమమును గూడ స్థాపించినాడు.

పరిశోధనలు:

జీవిత పరమార్థము నందు,
జీవిత విధానము నందు,
జీవిత విలువల యందు

యదార్థ దృక్పథమును కనుగొని- ఆచరించి బోధించుటకై ఆ సంస్థ క్రింద పలువిధములైన పశోధనలను సాగించినాడు.

ఆయన ఆవేదన:

"ప్రపంచ మంతా దేవుని సొత్తు; దానిని పరిపాలించుటకు - అనుభవించుటకు మనము ధర్మకర్తలము. అట్టి కర్తృత్వమును సహజీవన సిద్ధాంతముగా నిర్వచించి ధన్యజీవులము గావలె" నని ఆయన యొక్క ఆవేదన

వారిమనస్సులోని ఆలోచన యథాతథముగ నోటిలోనికి జారును దానిని శరీరము ఆచరణలోనికి తెచ్చును; ఇట్టి సమన్వయసంపదకు వారికి వారేసాటి

అన్నదాన సమాజము:

సుమారు పదిసంవత్సరముల కాలము వారి ప్రోద్బలము మీదనే విజయవాడలోని "అన్నదానసమాజము" నకు నేను కార్యదర్శిగా పనిచేసినాను. ఆ కాలములో శ్రీ వెంకటకృష్ణయ్యగారు, మాకు ధ్యేయమును బోధించి నడుపు ఋషిపుంగవుడై విలసిల్లినాడు. మా అనుయాయులు శ్రీ ఉప్పులూరి రామశాస్త్రి.

---

మానవులను సంఘర్షణ నుంచి తప్పించి సుఖజీవనము వర్ధిల్ల జేయుటకుగాను మానవసంఘమునకు రెండు చట్టములు వర్తించుచున్నవి. ఇప్పటి వాడుక భాషలో నికి **Law of Non-possession** అనిన్నీ, మరొకదానికి **LAW OF POSSESSION** అనిన్నీ గుర్తించునట్లు చేయవలెను. **LAW OF NON POSSESSION** క్రిందకు వచ్చువారు బహు కొద్దిమంది వుందురు. వీరు దైవచట్టమును అభిమాను చేసుకొని మానవచట్టములతో సమన్వయపరచగలరు. వీరు స్వంత ఆస్తులనుహక్కులుగా వుండవలెనని వాంఛించరు. తమ వారసులకు తమ తమ ఆస్తులు హక్కులుగాసంక్రమించవలెనని కోరరు. నాగరికచిహ్నములు- మానవుల శాంతి, జ్ఞానసంపత్తితోకూడిన శిక్షణ వీరి ఆశయములై వుండును. మానవునిలోగల సహజ కోరికలు విపరీత ధోరణి పట్టకుండా కట్టు దిట్టములు చేయుచుందురు. రాజరికములో రాజు దీనికి బాధ్యత వహించెను. ప్రజాస్వామ్యములో LAW OF NONPOSSESSION కు దారిచూపు శిక్షణద్వారా దీనిని హద్దులలో పెట్టుకోవలసియున్నది. అట్టి శిక్షణ నవలంబించుకున్న యెడల ప్రజాస్వామ్యంలో అసమానత్వం- అధర్మం పెచ్చుపెరిగి కల్లోల మేర్పడగలదు.

—ఆచార్య.

తెలుసుకోలేనిపరిస్థితి ఏర్పడుతుందనేభయమూ, స్వరాజ్యం సంపాదించుకున్నమీదట నిదానముగా ఈ పద్ధతులను ప్రవేశపెట్టుకోగలుగుతామనే ధైర్యమూ వుండటంవలన కాలయాపన జరిగినది. స్వరాజ్యం లభించినతరువాత నెహ్రూగారి విధానం ఏర్పడటం, గాంధీగారు మరణించటం జరిగినవి ఇందులో "గాఁవ్ హీ మేరా భారత్ హై"అని ఆశించినగాంధీగారిఆశయాలకి- ఖద్దరుసంస్థాన ఆశయాలకి తావులేకుండా పోయినది. దేశం అధోగతిపాలవుతోందని ధర్మకర్తగారు రిజిష్టర్ నోటీసుద్వారా హెచ్చరిక చేసిరి. ఐనప్పటికీ మానవసంఘమునకువర్తిస్తున్న Law of possession, Law of nonpossession లలో మొదటిదానికే అవకాశము చిక్కినది. ప్రజాస్వామ్యంలో ఇది విపరీతమార్గాలకు దోవ తీస్తుందని ధర్మకర్తగారి అభిప్రాయమైయున్నది.

నెహ్రూగారి యాజమాన్యములో Law of possession క్రింద పదునాల్గు సంవత్సరములకు మించినకాలం జరిగినది. చింతనశక్తులను గమనించకపోవటం వలన ఏ ప్రమాదం జరుగుతుందని ధర్మకర్తగారు హెచ్చరించారో- అది సత్యమై తీరింది. సాంఘిక పరిస్థితులలో అసమానత్వం తాండవిస్తోంది. ప్రభుత్వశాసనాను అస్తవ్యస్తంగా సాగుతున్నవి. వీలున్నవారు తమతమ వనర్లతో వారసత్వపుహక్కుల్ని వృద్ధి చేయుచున్నారు. దేశసంపదంతా వారసత్వంగా రూపొందుతోంది. దీని అనుభవం యేకొద్ది మందికో లభిస్తోంది. ప్రజాస్వామ్యంలో స్థానం దొరక్కుండాను,వారసత్వంలో హక్కు లేకుండాను ఉన్నటువంటి యెక్కువభాగంఓటరులు కమ్యూనిస్టులుగా ఎదుర్కొంటున్నారు. వారసత్వపు హక్కులు ఎంతెంతప్రమాణంలో వృద్ధిచెందితే అంతంతప్రమాణంలో వారు టెర్రరిస్టులయ్యేందుకు సంసిద్ధులయి వున్నారు. భారతీయసంస్కృతికి, ప్రజాస్వామ్యానికి పై రెండు పద్ధతులు హానికరములయినవే. ప్రజాస్వామ్యంలో Law of possession అవధులు అతిక్రమించటం వలననే పై విపరీత పరిస్థితి యేర్పడింది. ప్రభుత్వంకూడా "భూసంస్కరణలు" మొదలయిన శాసనముల నేర్పరచటంద్వారా తన తప్పు తెలుసుకుంటూ వారసత్వహక్కులను వృద్ధి చేస్తున్నవారికి చూచాయగా జాగ్రత్తపడమని హెచ్చరిస్తోంది. పరిస్థితి ముదరకముందే విజ్ఞానవంతులు తమ తమ వారసత్వములను ఖద్దరు సంస్థాన ట్రస్టుసూత్రములకు అనుగుణంగా మార్పిడిచేసి ధర్మకర్తలు కాగలగాలి. నేటి విజ్ఞానమంతా స్వార్థంతో ముడిపెట్టుకోబడినదై విపరీత మార్గాలకు దోవతీసిందని గుర్తెరగాలి. స్వార్థపాశాలను త్రెంచుకొని బయటపడకపోతే బంగారుప్రమాణంలేని కరెన్సీనోట్లు చిత్తుకాగితాలుగా పరిగణింపబడటంద్వారాను,మరికొన్ని శాసనములద్వారాను, కమ్యూనిస్టుల విజృంభణముద్వారాను వంచితులు కావలసి వస్తుంది.

ఖద్దరుసంస్థాన నిర్మాణంలోని అంతరార్థం దేశానికి, ప్రజలకి దుర్దశపట్టకుండా Law of nonpossession విధానాన్ని ఆచరణలో తగురీతిన ఋజువుచేసి చూపడమైయున్నది. ఆచరణనుచూసి, ఖద్దరుసంస్థాన గ్రంథమాలను చదివి పరిశీలింపవలసినదిగా విజ్ఞులకొక మనవి.

వారసత్వాలరూపంలో బిగిసివున్న దేశసంపదను గ్రామపరం, గురుకులాలపరం చేసి ప్రజాస్వామ్యంలో ప్రతి ఒక్కడు Law of non-possession విధానముక్రింద "అర్హత" ఋజువు చేసుకుంటూ అనుభవించేందుకువీలుగా నెలకొల్పబడినదే ఖద్దరుసంస్థానము.

భారతీయ సంస్కృతిని, ఆధ్యాత్మిక విలువలను అర్థంచేసుకొని తదనుగుణమైన గ్రామపెంపుద్వారా వైదిక కమ్యూనిజాన్ని స్థాపింప దివినుండి దిగివచ్చిన లెనిన్‌గా ధర్మకర్తగారిని నేను గుర్తిస్తున్నాను.

వారు స్మరించే పద్యము—

"ఎవనికడుపు యెంత నిలుపుకోగలుగునో అంతవఱకె హక్కు అతని కిలను
అంతకంటె మించి ఆశించి దాచెనో అతడె దొంగ శిక్షకర్హుడతడు"

అవనిగడ్డ శేషయ్య, మద్దాలి గోపాలకృష్ణయ్య, పెనమకూరి వెంకటప్ప[illegible]య్యగార్లు.

శ్రీ వెంకటకృష్ణయ్యగారికి — వారి ఆదర్శములను ఆచరణలో పెట్టి పరిశోధించుటకు అన్నదానసమాజము — ఒక విశ్వవిద్యాలయ పరిధిని ఉపయోగమై వెలసినది.

వారి విజయ పరంపరలు:

అన్నదానసమాజము మాకు కార్యరంగము. అచట రాట్నముల యజ్ఞమును పెక్కుసార్లు జరిపి జయమును గాంచితిమి.

1. వస్తుమార్పిడిని ఖద్దరు- పాలు- ధాన్యము మొదలైన సకల వస్తువులను సంపాదించితిమి. ఒకబస్తా ధాన్యమునకు — రెండువీసెల నెయ్యి; రెండు మణుగుల చింతపండు; అర్ధమణుగు పేకులు ఒకమణుగు మిర్చి; 8 గజముల సాదా ఖద్దరు; ఒక మణుగు నూనె- ఈ రీతిగా మార్పిడి విధానమంతయు గు[illegible]ంపబడినది. ఇట్టి వస్తుమార్పిడిని జీవిత విధానము లన్నింటియందును ప్రవేశపెట్టుటకు ప్రాతిపదికగ - ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షర శాలయందు అచ్చుపనులను గూడ సాధించితిమి. వీటి అన్నింటికి మూలమైన ధనము వడుకు నూలు చిలపలు (yarn bank). వాటితో సాధించని వస్తువే లేదు ; దేశసౌభాగ్యమునకు అది మూలద్రవ్యము. ఈ ప్రపంచమునందున్న ఐశ్వర్యము సంతను - వడుకు నూలు చిలపలతో కొలవదగునని వారు నిరూపించిరి. సహజీవనమునకు సర్వోదయమునకు యిది పరమావధి. ఇది వారి మొదటి విజయము.

2 "కుంది కసరత్తు" మొదలగు కాయకష్టముతో ప్రపంచమందలి ఆకలిబాధ — దారిద్ర్యము — లను నివారించి, ఈ [illegible]

సామ్రాజ్యముగా మార్చదగునని ఆయన నిరూపించినారు.

ఒకకుంది పట్టేధాన్యం బియ్యంగా దంపిన యెడల రెండు "ఇడ్డెనలు" వరుమానం; లేక బెల్లంతో చేసిన కొబ్బరి లౌజు "ముద్ద". ఒక వడుకు నూలు చిలపను తీసి యిచ్చిన యెడల-ఒకపూట భోజనం వరుమానం. కుంది కసరత్తుకు ఉపాహారము - నూలు చిలపకు భోజనము ఈ రీతిగానే ఇతర వరుమానములు ఏర్పరుపబడినవి. విజయవాడ యందు నెలదినములు జరిగిన ఆంధ్ర ఖాదీ ఎగ్జిబిషను మున్నగు అనేక సందర్భములందు ఈ వస్తుమార్పిడి పద్ధతిని భోజనవిధానమును వారి నాయకత్వమునందు మేము నడిపి జయమును గాంచితిమి.

ద్రవ్యము అనగా నాణెములతో అవసరము లేకుండా, ఎంత స్వల్పమయినకాయకష్టముతో నైన జీవితమును సౌఖ్యవంతముగాను నిరాటంకముగాను గడుపవచ్చునని శ్రీ వెంకట కృష్ణయ్యగారు నిరూపించిరి; ఇది వారి రెండవ విజయము.

3 పాఠశాలలందు విద్య నభ్యసించు విద్యార్థులు మనదేశ సాంప్రదాయ సంస్కృతుల కనుగుణ్యమైన విద్యను అనుభవింప వలయుననియు, అట్టి విద్యవలన విద్యార్థి దశయందు గూడ స్వయంపోషకముగ నుండవలయుననియు వారి సంకల్పము. శ్రీ ఉప్పులూరి రామశాస్త్రిగారి ఆధ్వర్యముక్రింద అట్టి ఆదర్శముతో పాఠశాల నొకదానిని నడిపితిమి. ఇతరుల పిల్లలతో మాత్రము తన పరిశోధనలను చేయుట వారి సంకల్పముగాదు. అందుచేత ఈ పాఠశాల యందు వారి యొక్కయు, వారి కుటుంబీకుల యొక్కయు పిల్లలను విద్యార్థులుగాముం[illegible] చేర్చి

పరిశోధనలను జరిపిరి. విద్య స్వయంపోషకముగ చేయదగునని ప్రదర్శనా సహితముగా నిరూపించిరి. ఇది వారి మూడవ విజయము.

ఇట్టి విజయపరంపరల నెన్నింటినో - అన్నదాన సమాజ ప్రాంగణమున పరిశోధించి - సాధించితిమి.

## సర్వోదయ సిద్ధి :

అలనాడు అన్నదానసమాజమునందు మేము చేసిన పరిశోధనలన్నియు సహజీవన సిద్ధాంతమునకు ప్రాతిపదికలు - సర్వోదయ సిద్ధికి పునాదులు. అప్పుడుగాని - ఇప్పుడుగాని దేశమును పాలించుచుండిన ప్రభుత్వము గుర్తించి వానిని ఆచరణలోనికి తెచ్చిన యెడల మనదేశమును పీడించుచున్న ఎన్నియో సమస్యలు, అతి సులువుగా - అనాయాసముగ -జనసామాన్యమునకు హితముగ - పరిష్కారమగుచుండి యుండును. జనులు శాంతియుత సహజీవనులై తుష్టితోను, పుష్టితోను జీవించి ఉండెడివారు. సర్వోదయము సిద్ధించి, దేశమంతను దేదీప్యమానముగ ప్రకాశించు చుండెడిది.

## క్రమశిక్షణకు ఆదర్శము వారి కుంటుంబమే!

నలుబదిమంది జనాభా గలిగిన శ్రీ వేంకటకృష్ణయ్యగారి కుటుంబము అందరును ఖద్దరు సంస్థానమందు అవిభక్తులై యున్న సభ్యులు. వారందరియందునుగల క్రమశిక్షణ అద్భుతము, అసమానము. వారి కుటుంబీకులేగాక, ఇతర కుటుంబములనుండి వారింటికి ఏతెంచిన కోడళ్లు కూడ దీనిని అవలీలగ అనుసరించగలుగుతున్నారంటే ఈ కార్యక్రమముయొక్క విశిష్టత బోధపడుతుంది. సోమరిపోతులుగా ఖద్దరుసంస్థానమందు భుజించువారు లేరని చెప్పిన అతిశయోక్తి కాదు. సోమరిపోతులై తిండిగినేవారిని "తిండిదొంగ" లని ఆయన నామకరణము చేసినారు.

ఇట్టి నియమ "స్వయం నిర్ణయ సూత్రము" యొక్క అంతరువు మీద పనిచేయగలిగినారంటే శ్రీ వేంకటకృష్ణయ్యగారి యొక్క పట్టుదల- సామర్థ్యము- ప్రతిభ-మనకు వ్యక్తం కాగలవు.

## మా అనుభవములు:

శ్రీ ఆచార్య ప్రఫుల్లచంద్రరేగారు పుస్తకాలలో వ్రాసిన "రాట్నము" వినిపించు శ్రావ్యగానమును శ్రీ వేంకట కృష్ణయ్యగారు మాకు ప్రత్యక్షముగా వినిపించిరి.

కుంది కసరత్తు- నూలు తీయుట- తోటపని చేయుట - నీళ్ళుతోడుట లేక మోయుట-బట్టలు ఉతుకుట - మొదలగు సులభతరములగు శరీర పరిశ్రమలను చేసి అట్టి కాయకష్టముచే ఆర్జించిన ఇడ్డెనలు - అవళ్ళు - పులిహోర - ఫలహారములనేగాక భోజనములను సహితము ఆరగించు భాగ్యమును మేము స్వయముగా పొందితిమి.

## దేవుని రాజ్యము :

ఇందువలన స్వశక్తిమీద నమ్మకము కలిగినది. ఆత్మగౌరవము - ఆత్మవిశ్వాసము- సత్యమునందనురక్తి, ప్రేమతత్వము-సహజీవనము-సర్వోదయము — మాకు పుష్కలముగలభించి, దేవుని రాజ్యమంటే ఏమిటో చవిచూడ గలిగినాము. సోమరిపోతుతనమంత హీనత్వము లేదనియు—

అది దేవుని రాజ్యము నుండి మనలను దూరము నకు కొనిపోవుననియు తెలిసికొన్నాము.

### బేసిక్ విద్యా విధానము :

శ్రీ గాంధీమహాత్ములవారు ప్రతిపాదించిన బేసిక్ విద్యా విధానమును మన ప్రభుత్వము వారిచే పాఠశాలలందు ప్రయోగింపబడి విఫల మైపోయినదని వినుచున్నాము. శ్రీ వేంకట కృష్ణయ్యగారి స్వయంపోషక స్వశక్తి ప్రబోధక పద్ధతుల వరవడి మీద అట్టి పాఠశాలలను నడ పిన యెడల నూటికి నూరుపాళ్ళు జయప్రదము కాగలవని మా నమ్మిక.

అయితే వాటిని నడుపుటకు ప్రస్తుతము అమలులోవున్న విద్యావిధానమునందు పొందిన అర్హతలు చాలవు. తాము నిర్వహించు పని యందు ఆత్మవిశ్వాసముగల సుశిక్షితులైన సేవావ్రతులేతప్ప జీతపురాళ్ళమీద మాత్రమే దృష్టిని నిగిడ్చుకొను మామూలు ఉపాధ్యా యులు పనికిరారు.

### వారి పరిశోధనలు అమూల్యములు :

శ్రీ టాల్‌స్టాయ్ మహాశయుని అపూర్వ, అసమాన పరిశోధనలవలెనే శ్రీ వెంకట కృష్ణయ్యగారి పరిశోధనలు గూడ ప్రతిభావంత ములు. అందుచేత వానిని కాలగర్భమునమాటు పడి పోనివ్వరాదు. విషయ విభాగ పద్ధతిని గ్రంథ స్థము చేసి వానిని వెల్లడిలోనికి తీసికొని వచ్చిన యెడల ముందు తరములవారికి అమూల్య మైన లాభములను చేకూర్చగలవు.

### వారే ఒక మహాసంస్థ :

శ్రీ వేంకట కృష్ణయ్యగారే ఒక మహాసంస్థ. వారి విజ్ఞానమునకు అంతు-దరి లేవు; వారు జీవిత విశ్వవిద్యాలయము! ఎన్నో జన్మలనుండి సాధిం చిన సంపత్తి యంతయు వారియందు పుంజీ భూతమై తొణికిసలాడుచు సర్వదా వడ్డనకు సిద్ధ ముగ నుండి యుండెను.

పుస్తకాలలో చదువుకొన్న - పెద్దలు ఉప న్యాసములలో చెప్పిన మహత్తర విషయముల నన్నింటిని, జీవిత ఆదర్శముల నన్నింటిని వారి సన్నిహిత సహచర్య భాగ్యమువలన నిత్య జీవి తములో వింటిమి - కంటిమి — ఆచరించిఅనుభ వించితిమి-

### విశాలాకాశకోశము :

శ్రీ వేంకటకృష్ణయ్యగారు భౌతిక కాయ మును వీడినను ప్రతిభావంతములగు వారి భావ పరంపరలన్నియు ఈ విశాలాకాశకోశమునందు భద్రపరుపబడియే యున్నవి. తగిన సామర్థ్యము గలవారు తమ సంకల్ప - సాధనా బలముల చేత - అట్టివానిని సాధించి జీర్ణించుకొని తమ యొక్కయు, లోకము యొక్కయు కళ్యాణము నకు తోడ్పడెదరుగాక! ♦♦♦

"సక్రమమగు మార్గములద్వారా ధనము నిలబెట్టుట తగదని శిక్షణ యిచ్చుటలేదు, కాని దానధర్మములు చేసి వాటి పలుకుబడి, పెట్టుబడితో ప్రజలను నీవుగాని, నీ సంతతివారుగాని వంచించునట్లు జరుగకుండా జాగ్రత్త పడుము. కొంత ఆస్తి ధర్మసొత్తుగాను, కొంత స్వంతసొత్తుగాను నీవద్దవుంచుకోవద్దు. యావత్తు ధర్మసొత్తు చేసి అందులో అవినాభావసంబంధము తెచ్చుకొనుట ఉత్తమము. లేదా అహింస సేవాసంఘములో సభ్యులుగా వుండతగిన వారి ధర్మకర్తృత్వము క్రింద నీ దానధర్మములను ఒప్పగింతచేయుము. అర్హతమీద తప్ప వారసత్వేన ధర్మసొత్తుల మీద నీ వారసులు అధికారము చెలాయించుపద్ధతి అవలంభించకుము. ఈ పద్ధతులకు నీవు యెవరకూ తోడ్పడవద్దు"

— ఆచార్య.

మా ఖాతాదారులందరికి నూతన సంవత్సర శుభాకాంక్షలు

ఫోన్ నెం 559 | గ్రాము: గుడ్‌విల్

# శ్రీ రామా లారీ ట్రాన్స్‌పోర్టు కంపెనీ

హైదరాబాద్ రోడ్డు - **విజయవాడ-1**

బ్రాంచి: ఓల్డు బీట్ రోడ్ - వరంగల్ (ఫోను 387)

కాంట్రాక్టర్లు: మహాదేవ్‌పూర్ ఐ.యల్.టి.డి. బ్రాంచికి
విజయవాడ నుండి వరంగల్‌కు డైలీ పార్శిల్ లారీ సర్వీసు గలదు.
సకాలములో సరకులను మా స్వంత లారీలపై భద్రంగా రవాణా చేయబడును.
ఒకసారి దయచేసి ప్రయత్నించిన మీకే తెలియగలదు.

మా ఖాతాదారులందరికి నూతన సంవత్సర శుభాకాంక్షలు

ఫోను: 1259 | గ్రాము: ప్రెసిషన్

# దుర్గా డీసెల్ హౌస్ (రిజిష్టర్డు)

## మైకో-బాష్ సర్వీస్ ఏజంట్సు

గోశాల రెడ్డి రోడ్, **విజయవాడ-2.**

| | | | |
|---|---|---|---|
| పెర్కిన్సు | మెడోస్ | డేవిడ్ బ్రౌన్ | లిష్టర్ |
| బెంజి | ఫోర్డుసన్ | బైలారన్ | సిడ్లీ |
| లేలెండ్ | ఫెర్గూసన్ | పెట్టర్ | నేషనల్ |

పైన తెలియపర్చిన డీసెల్ ఇంజన్ల పంపులు, పవర్ కేలిబ్రేషన్, అరుగుదల తక్కువగావున్న పాత నాజిల్సు రీ కండీషనింగ్, ఆధునిక యంత్రములపై అనుభవంకల పనివారిచే ఆటోమొబైల్ ఇంజనీరు పర్యవేక్షణ క్రింద సకాలంలో చేయబడును

**మైకో-బాష్** ఎలిమెంట్సు, నాజిల్సు, ఫిల్టర్సు మా వద్ద సరసమైన ధరలకు లభించును.

# BEZWADA MOTOR STORES,

CONVENT STREET, P B NO 84

VIJAYAWADA-1

Phones:
Office: 240
Work shop: 1478
Residence: 295

Grams:
'BEZMOTORS'

*Dealers for*

STANDARD CARS & PARTS

*for*

Krishna &
West Godavary Districts.

★

*Dealers for*

TYRES

&

TUBES.

*AUTHORISED DEALERS*
*FOR*

**D O D G E**

**TRUCKS AND CARS**

*FOR*

Srikakulam, Visakhapatnam,
East Godavary, West Godavary,
Krishna, Nellore, Cuddapah,
Chittoor, Kurnool &
Anantapur Districts

of

Andhra Pradesh.

★

ATTRACTIVE
HIRE PURCHASE FACILITIES.

*Dealers for*

PERKINS
ENGINES
& Parts

*for*

Krishna, East &
West Godavary Districts.

★

GENUINE
MOPAR

&

MEADOWS
PARTS

&

ACCESSORIES
AVAILABLE AT
REASONABLE RATES.

***SERVICE IS A SPECIALITY.***


Edited, Printed and Published by J. Bhaskara Rao, Ravaana Samaachar, Congress Office Road,
Vijayawada-2 and Printed at Graama Swarajya Press, Vijayawada-2
Wrapper Printed at Sri SaradaPress, Vijayawada-2.